# వినాయక రూప ప్రశస్తి

—— శ్రీ శివచిదానంద భారతీస్వామి

మన సనాతనలు వినాయకుని ప్రథమ గణాధ్యక్షునిగా ఆరాధించుటకు విధి విధానము కల్పములు ఏర్పాటు చేసినారు. సనాతన ధర్మాచారపరులు పూజించే దేవతా మూర్తులు గాని వాటి వర్ణనలు గాని, రూపురేఖలు గాని, సరిగా అవగాహన చేసుకొనినచో అవి సందేశాత్మకము గాను ఏఏ పంథీయు ఎటుల యోచన చేసినప్పటికి వారలకు కూడా వందనీయ సందేశాత్మక రూపముగా విలసిల్లవలసినదే మన పూర్వులు కొన్ని విషయములు చెప్పినప్పుడు బాహాటముగా కాక, గూఢార్థరూపముగాను, సాంకేతిక రూపముగాను వివరించుట సాంప్రదాయము కలదు. అనగా Symbolical గా చెప్పుట కలదు వినాయకుడు ప్రతి హైందవునకు ప్రథమ ఆరాధ్య దైవమనుటలో ఎట్టి సందేహము లేదు కాని ప్రపంచములో అనేక జాతులు ఉద్భవించినవి. విశ్లేషించి, ఆహార నియమములను బట్టి విభజించినచో రెండే భాగములగును అవి ఏమన శాకాహారులు మరియు మాంసాహారులు. అస్తవ్యస్తముగా రచించే చరిత్రకారులు తొలి మానవుడు వన్యజీవి అనియు, మృగములను వేటాడి అపక్వము గానే భుజించెడి వాడని వ్రాసి మన పురాణ, ఇతిహాసములకే కళంకము తెచ్చినారు. మానవుడు ప్రథమతః వన్యజీవియే అయినచో అందుబాటులో ఉన్న శాకాహారమునే భుజించవలయును గాని, పరిమిత సంఖ్యలో గల జంతుజీవములను ఏల చంపి తినవలయును? అది ఆనాటి మానవులకును సరిపోదుకదా ! అందుచేత వినాయక రూపము ప్రథమతః మానవుడు శాకాహారియే అనియు, అది భుజించినచో దేహమునకు సరిపడు పుష్టి, తుష్టి కలిగించునని ప్రచారము చేయు, సాంకేతిక రూపమే అవగలదు ఇటీవల ప్రతివారు మాంస భక్షకులు అయినచో శరీరమునకు శక్తి దృఢత్వము కలుగునని సలహా ఇచ్చే వైద్య ప్రముఖులు కలరు. మాంసాహారము రోగమును పెంచునదే గాని శాకాహారములా సాత్విక ఆహారము కానేరదు. ఆ వినాయకునకు శిరస్సు ఒక ఏనుగు యొక్క తల, ఈ భూమిపై చరించే భూచరములన్నిటిలోను పెద్ద దేహము, బలముగల జంతువు ఏనుగు అది పూర్తిగా శాకాహారి. ఆ వినాయకునకు వాహనము ఎలుక. అన్ని జీవులలోను అతి చిన్న జీవి ( Timy Creature ) అయినప్పటికి దానిని వినాయకునికి వాహనము చేసినారు. వాహనమునకు రెండు ముఖ్యలక్షణములు అవశ్యకం ఒకటి వేగం, రెండు బరువును వహించవలె ఆ రెండు లక్షణములు శాకాహారములో గలవు.

అదియును శాకాహారియే. దాని అర్థం శాకాహారికి తన నిత్య జీవితములో వేగమును పెంపొందించుకొనుటకు ఎంత భారమయినను వహించుటకు శాకాహారమే ముఖ్యమని, అందు సందేశము గలదు, మరియును ఆ వినాయకునకు పెద్ద బాన అంత పొట్ట చూపినారు. అనగా ఈ సృష్టిలో గల అన్ని కుక్షిలను నింపగల శక్తి, ఉత్పత్తి ఒక్క శాకాహారమునకే కలదని చెప్పుటకే Symbolical గా పెద్ద పొట్ట చూపినారు అంతేగాక ఆ స్వామి హస్తములో శాకాహార రూపమున ఉండ్రమును కూడా చూపినారు అందుచేత వినాయకుడు సందేశాత్మకముగా హైందవేతరులకు కూడా ఆరాధ్య దైవమే కాగలడు.



సెప్టెంబరు 1995

సంపుటి : 11

సంచిక : 9



# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం - 521 001

ఫోన్ : 22818



| | | |
|---|---|---|
| విడి ప్రతి | : | రు. 4-50 |
| సంవత్సర చందా | : | రు. 54-00 |
| 4 సం॥ల చందా | : | రు. 200-00 |
| జీవిత సభ్యత్వం | : | రు. 600-00 |
| పోషకులు | : | రు.1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at SREE VANI PRINTERS MACHILIPATNAM Phone : 21137

Despatched on 11-9-1995


## విషయసూచిక



ముఖచిత్రం : దృఢమనస్కుడు ధ్రువుడు

# దృఢ మనస్కుడైన ధ్రువుని చరిత్ర

-భరద్వాజ్

మనుచక్రవర్తికి ఇరువురు పుత్రులు, పెద్దవాడు 'ఉత్తానపాదుడు,' రెండవవాడు "ప్రియవ్రతుడు" ఉత్తానపాదునికి ఇరువురు భార్యలు. 'సునీత' పెద్ద భార్య, రెండవ భార్య 'సురుచి'. సునీత కుమారుని పేరు 'ధ్రువుడు' సురుచి కుమారునిపేరు 'ఉత్తముడు' ఉత్తానపాదునికి, రెండవ భార్య 'సురుచి' మీద అమితమైన ప్రేమ. దీనిని ఆసరాగా తీసుకొని 'సురుచి' సమయం వచ్చినప్పుడల్లా 'సునీత మీద భర్తకు కొండెములు చెబుతూ భర్త మెప్పును పొందుతూ వస్తుండేది. రానురాను ఉత్తానపాదుడు తన పెద్ద భార్య అయిన 'సునీత' ని దూరంగా ఉంచుతూ వచ్చాడు. సునీతతో పాటు సునీత కుమారుడైన ధ్రువుని మీద కూడా ప్రేమ చూపించేవాడు కాదు ఉత్తానపాదుడు తన మీద చూపించకపోయినా తన కుమారుని మీద కూడా రాజు ప్రేమ చూపించనందులకు 'సునీత' ఎంతో బాధపడుతుండేది ఏమి లాభం ? రాజులకు అనుగ్రహం కలిగినా ఆగ్రహం చెందినా ఎవరూ పట్టలేరుగదా !

ఒకనాడు 5 సం॥ గల ధ్రువుడు, 4 1/2 సం॥ గల ఉత్తముడు తోటలో ఆడుకుంటున్నారు. వీరిని చూస్తూ తండ్రి ఉత్తానపాదుడు ఎంతో ఆనందపడుతున్నాడు ఉత్తముడు పరుగెత్తుకుంటూ వచ్చి తండ్రి తొడమీద కూర్చుంటాడు అది చూచిన 'ధ్రువుడు' తాను కూడా తండ్రి తొడమీద కూర్చుంటే బాగుండునని తలంచి, వచ్చి రెండవ తొడమీద కూర్చుంటాడు. కాని వెంటనే సవతితల్లి 'సురుచి' వచ్చి -

" తండ్రి తొడనెక్కు వేడుక దగిలెనేని
పూని నా గర్భమున నాఁడు పుట్ట కన్య
గర్భమునఁ బుట్టగోరినఁ గలదె లేదు
జనకుతొడ యెక్కు భాగ్యంబు సవతికొడుక"
"అదిగాన నీవధోక్షజు, పదపద్మము
లాశ్రయింపు
పాయన హరి నా యుదరమునఁ
బుట్టనిచ్చును
వదలక యట్లయిన ముదము
దవఁ సెద వనఘా "

అని పలుకుచూ 'సురుచి' ఆ పసిబాలుడైన 'ధ్రువుని' లాగి దూరంగా విసిరివేసింది రాజు మాత్రం నోరు మెదపలేదు. ధ్రువుడు ఏడుస్తూ ఇంటికి చేరాడు. తల్లి సునీత ఎంత అడిగినా కారణం చెప్పలేదు. ఆ సంఘటన చూచిన దాసీలు జరిగినదంతా చెప్పారు. తన కడుపున పుట్టినందువలననే గదా ! ధ్రువునికి ఇటువంటి అవమానం జరిగిందని 'సునీత' లోలోన బాధపడుతూ, ధ్రువుని తన ఒడిలో కూర్చోబెట్టుకొని తల నిమురుతూ 'బిడ్డా : విచారింపకుము పూర్వజన్మలో ఏమి చేసుకుంటామో, అది అనుభవించక తప్పదు. మనం పురాతనమున చేసిన పాపములు సురుచి రూపమును వహించినదనుకొనుము. ఒక విధంగా సురుచి మంచే చేసింది ఆమె నీకు హరి చరణములు సేవింపుమని చెప్పిందిగదా ! కనుక హరి పాదములను పూజింపుము. నాకును, నీకును ఆయనయే దిక్కు. నారాయణుని పాద కమలములు పూజించుట వలననే బ్రహ్మకు బ్రహ్మత్వం సిద్ధించింది మా తాతగారు 'మనువు' శ్రీపతిని భజించడం వలన ఇహ పర సుఖములను

బడయుటయే గాక ఎనలేని కీర్తి ప్రతిష్ఠలను కూడా సంపాదించుచున్నాడు. నీవు కూడా ఆ రమాపతిని పూజించి, భజించి, సేవించి సర్వసుఖములు బడయుము' అని ఉపదేశించింది తల్లి సునీత.

తల్లి ఆశీర్వాదమును పొంది ధ్రువుడు, దామోదరుని సేవించుటకై బయలుదేరాడు. అరణ్య మార్గమధ్యంలో నారదుడు ఎదురుపడ్డాడు. తన దివ్యదృష్టితో ధ్రువుని సంకల్పమును గుర్తించి ఆ బాలకుని పరీక్షించదలచి "వత్సా ! ఆట పాటలయందు కాలము గడుపవలసిన ప్రాయములోనున్న నీవు, తల్లిదండ్రుల సమక్షంలో సకల సౌకర్యముల ననుభవిస్తూ కాలం గడుపవలసిన నీవు, ఈ ఘోరారణ్యంలో ఎక్కడికి పోతున్నావు నాయనా ? అని అడుగుతాడు అప్పుడు ఆ బాలుడు ఎంతో ధైర్యంగా "నా తల్లి ఆజ్ఞానుసారము శ్రీహరి అనుగ్రహమును సంపాదించడానికి వెళ్లుతున్నాను " అంటాడు అప్పుడు నారదుడు "ఎంతో కష్టపడి, ఎన్నో వత్సరాలపాటు తపస్సు చేసే యోగీశ్వరులకు కూడా సాధ్యపడని శ్రీహరిని నీవు ఎలా పొందగలుగు తావు ? ఇది అసాధ్యం కనుక నీ ప్రయత్నమును విరమించుకొనుము అవివేకముతో లేనిపోని ప్రయత్న ములు చేయక, దైవప్రేరితములైన సుఖదుఃఖములకు తలయొగ్గి కాలము గడుపుకొనువాడు వివేకవంతుడు. తన కంటె గొప్పవానిని చూచి ఈర్ష్యపడక ఆనందించే వాడు, నీచుల వైపు చూడక, సమానునితో మైత్రి నెఱపి ప్రవర్తించువాడు తాపత్రయాదికములచే పీడింప బడక సుఖించును" అని హితవు చెబుతాడు నారదుని హితవు ధ్రువునికి నచ్చక "ఓ నారదమునీంద్రా! సతతమూ వీణ వాయించుకుంటూ ముల్లోకములు సంచరించే నీకు, తెలియనిదేమున్నది ? సుఖ దుఃఖోపహతులకు శాంతి అలవడదు. నేను క్షత్రియ బాలకుడను నా సవతి తల్లి కఠినమైన వాక్కులతో నా హృదయం కలచివేయ బడింది కనుక నా చిత్తమున శాంతి నిలువదు. ముల్లోకములయందు లేనటువంటి, అనన్యమైన దుర్లభమైన స్థానమును పొందగోరుతున్న నాకు ఉత్తమమైన మార్గమును చూపింపుము" అని ప్రార్థించాడు ధ్రువుడు. ధ్రువుని మాటలు విని నారదుడు ఎంతో ఆనందపడ్డాడు. "కుమారా ! నీ దీక్ష చాలా దృఢమైనది. శ్రీహరిని పూజించి శుభములు బడయుము శ్రీహరి యమునానది తీరమున సంచరించడం వలన అది అతి పవిత్రమైనది. యమునలో స్నానం చేసి, అతి పుణ్యప్రదేశమైన మధువనమునకు వెళ్ళి నారాయణుని నిష్ఠతో భజింపుము, పూజింపుము నీ కోరిక నెరవేరుతుంది " అని చెబుతాడు నారదుడు అప్పుడు ధ్రువుడు అనన్య భక్తితో నారదునకు ప్రదక్షిణచేసి, సెలవు గైకొని మధువనము నకు బయలుదేరుతాడు యమునా నదిలో స్నాన మాచరించి, మధువనంలో అనుకూలమైన స్థలమును చూచుకొని తపస్సును చేయ ప్రారంభిస్తాడు. మొదటి మాసంలో మూడురాత్రులకొకపర్యాయం వెలగపండ్లను రేగుపండ్లను తిని హరి ధ్యానములో నిమగ్నమవుతాడు రెండవ మాసంలో ఆరేసి దినములకొక పర్యాయం ఆకులలములు తిని విష్ణుదేవుని పూజిస్తాడు మూడవ మాసములో తొమ్మిదేసి దినములకొక పర్యాయం జలం సేవించి మాధవుని అర్చిస్తాడు. నాల్గవ మాసంలో పన్నెండు దినములకొక పర్యాయం వాయుభక్షణచేసి పుండరీకాక్షుని భజిస్తాడు. ఐదవ మాసంలో గాలిని బంధించి అచేతనుడై, ఒంటి కాలిమీద నిలిచి పరమాత్ముని ధ్యానిస్తాడు. తరువాత హృదయమును నిర్మలం చేసుకొని, సకల సృష్టికి ఆధారభూతుడైన సర్వేశ్వరుని మీద మనసు నిలిపి ధ్యానంలో నిమగ్నుడవుతాడు. అంతట భూమి కంపించెను. అరణ్యమంతా దద్దరిల్లి పోయెను. సకల చరాచరములు భయకంపితులై భగవంతుని చెంతకుపోయి, ఆపదను బాపమని మొర పెట్టుకొనిరి. శ్రీహరి వారికి అభయమిచ్చి గరుడా రూఢుడై మధువనమునకేగి ధ్రువుని చెంత సాక్షాత్క రించెను అప్పుడు ధ్రువుడు కళ్ళు తెరచి దామోదరుని చూచి సాష్టాంగ ప్రణామమాచరించి, స్తోత్రము చేయ

(తరువాయి 33 వ పేజీలో)

# అమృతవాక్

శ్లో॥ శాంతా మహాంతో నివసంతి సంతః
వసంతవత్ లోకహితం చరంతః
తీర్ణాః స్వయం భీమ భవార్ణవం జనాన్
అహేతునాఽన్యానపి తారయంతః ॥

**అనంతమైన** కాలప్రవాహంలో ఋతువులు ఘట్టాల్లాంటివి. వచ్చే మార్పులు ప్రాణులపై ప్రభావం చూపిస్తాయి. మానవులయితే వెంటనే ఆ ప్రభావానికి స్పందిస్తారు. అయా కాలాల్లో కలిగే కష్టసుఖాల్ని హావభావాలతో ప్రకటిస్తారు

గ్రీష్మం వచ్చింది అని ముందు సంతోషిస్తారు ఇక తరువాత ఆ గ్రీష్మం పెట్టే తాపానికి తట్టుకోలేక జనం అల్లాడిపోతారు దీనికి తోడు గాలికి మొహంవాచిపోతారు. చండప్రచండంగా విజృంభించిన యీ గ్రీష్మం పీడ ఎప్పుడు పోతుందా ? ఎప్పుడెప్పుడు వానలు పడతాయా అని జనం వర్షర్తువుకెదురుతెన్నులు చూస్తారు

సరే వర్షర్తువు వచ్చిందనుకోండి మొట్టమొదట చాలా బాగుంటుంది. దేశం చల్లబడింది మానసిక శారీరక తాపాలు తగ్గి యెంతో హాయిగావుంది అని అనుకొంటారు. ఉండటానికి చక్కని ఇల్లుండీ తినటానికి సమృద్ధిగా సంపదలున్న మనుష్యులకు వర్షాకాలమంతా చాలా బాగుంటుంది. వాళ్ళకు కాలుతీసి బయట పెట్టనక్కర్లేదు కనుక. తెల్లారితే పొట్ట చేతబట్టుకొనే వాళ్ళెక్కువ వాళ్ళందరికీ 'ఎన్నాళ్ళీ వర్షాలు' అని అనిపిస్తుంది. మొహం మొత్తుతుంది తీపిపదార్థంలాగా, ఇల్లు విడిచి వెళ్ళకపోతే వాళ్ళకు గడవదు. వెళితే ఒకటే వర్షం - ఏం వానలండీ పాడు వానలు' అని పాపం వర్షాన్ని తిట్టుకోటం కూడ కద్దు

వానలు పోయాయి శరదృతువులో వెన్నెల పుచ్చపువ్వులా నేలంతా పరచుకొని జనానికెంతో ఆనందదాయకంగా వుంటుంది నదుల్లో నీళ్లుకూడా తేటపడ్డాయి. అయితే చిక్కేమిటంటే ఈ ఋతువులో రోగాలెక్కువ వస్తాయిట. వాటిని నివారించుకోవటానికే శరన్నవరాత్రులలో అమ్మవారి పూజ చేస్తారని దేవీభాగవతంలో వులది కనుక శరత్తన్నా జనానికి మొహం మొత్తుతుంది.

ఇలాగే హేమంతం బాగానే వుంటుంది మొదట. క్రమంగా మంచు బాధ ఎక్కువై మనుష్యులకు దానిపై మక్కువ తగ్గుతుంది బారెడు పొద్దెక్కితేగాని సూర్యుడు మంచు తెరలు తెంచుకొని రాడు బాబోయ్ ఇదెప్పుడు పోతుందా అని జనాలు తిట్టుకుంటూనేవుంటారు.

శిశిర ఋతువు వచ్చిందికదా అని అందరూ మామూలుగానే సంతోషిస్తారు. సంవత్సరానికి చివరి ఋతువు. చలిచలిగా వుంటుంది. హాయిగా దుప్పటి కప్పుకొని పడుకోవచ్చనుకుంటారు. వాళ్ళవాళ్ళ వయస్సుకు తగ్గ ఆనందమనుభవిస్తుంటారు జనం ఎటొచ్చీ కాస్త వృద్ధులకిబ్బందిగానే వుంటుందనుకోండి కొత్తపంటలింటికి రావటంధాన్యలక్ష్మితో లోగిళ్లు కళకళలాడటం గమనిస్తాం సంక్రాంతి సంబరాలు ప్రారంభమవుతాయి. ఆడపడుచులు అల్లుళ్ళ రాకతో పల్లెపట్టులుశోభాయమానంగా వుంటాయి అయినా ఈ ఋతువు అందరికీ పడదు

ఇలా చూస్తూపోతే అన్ని ఋతువులు అంతంతమాత్రమే కాని సంవత్సరం మొదట వచ్చే వసంతర్తువు అందరికీ సమానంగా హాయినిస్తుందంటారు వసంతంలో రాజులు పరిణామ రమణీయంగా వుంటాయని కావ్యాలు గొప్పగా వర్ణిస్తాయి అందరికీ సంతసం కలిగించేది ఒక్క వసంతమే ఈ కాలంలో పరిసరాలు ప్రశాంతంగా వుంటాయి రంగురంగుల పూలు చక్కగా విచ్చి సుగంధాలు విరజిమ్ముతాయి చల్లని మలయపవనం శరీరాలకలసట తీర్చి హాయి కూరుస్తుంది. సకల లోకానికి హితంగా వుండేది యీ వసంతకాలం. అందరి మనస్సులు ప్రసన్నంగా వుంటాయి. కనుక వసంతానికో విశిష్టత, ప్రత్యేకత పొంది తాపంగాని, వర్షంగాని, చలిగాని వ్యాధులుగానీ ఏవీ వుండవీకాలంలో. అందరికీ సుఖాన్నందించే అద్భుతకాలం వసంతం.

ఈ వసంతం లాంటివారే సజ్జనులు వారికి కూడా లోకహితమే ముఖ్యం ఎప్పుడు చూచినా వసంతంలాగా పడిదుడుకులు లేకుండా ప్రసన్న గంభీరంగా వుంటారు.

సత్పురుషుల మనస్సుల్లో ఎలాంటి వికారాలూవుండవు బ్రహ్మానుభూతిలో లీనమైవుంటారీ మహాత్ములు. సంతులంటే వీరే, సత్పదార్థమైన బ్రహ్మనెరిగిన వారగుటచేత వారే బ్రహ్మ స్వరూపులు.

అలాంటి వసంతంలాంటి సంతులు భయంకరమైన సంసార సాగరాన్ని వాళ్లు దాటటమేకాదు, ఎలాంటి ప్రత్యుపకారమూ కోరకుండానే అవ్యాజ కరుణతో యితరులను గూడా సంసార జలధిని దాటిస్తారు అలాంటి వారికి లోకమంతా ఒకే కుటుంబం.



గురుపూర్ణిమ సందేశం



# అభిమాన మమకారములను తగ్గించుకోవాలి
# విశాలమైన మనసును పెంచుకోవాలి

— భగవాన్ సాయి దివ్యప్రబోధ

దివ్యాత్మస్వరూపులారా !

భూమిలో నీరు చాలా తరిగిపోయినది. కారణమేమిటి ? మానవునియందు నీతి నిర్మూలనం కావటంచేతనే భూమియందు నీరు కూడా ఇంకిపోతూవచ్చింది. మానవ జీవితమునకు నీతియే ప్రాణం. నీతి మానవత్వమునే వికసింపజేస్తుంది. అట్టి నీతిని ఈనాడు మానవుడు కోల్పోవటంచేతనే, నీటిని కూడా కోల్పోవటానికి అవకాశం ఏర్పడింది. ఈనాడు వేదాంతమును అనేక విధములుగ ప్రచార ప్రబోధలు చేస్తున్నారు. ఈ వేదాంతము యొక్క ప్రభావముచేత మానవుడి యొక్క మనసు వేడెక్కుతున్నది. ఈ వేదాంతంచేత హృదయం చలించిపోతున్నది. జీవితమే ఒక సందేహాస్పదంగా ఐపోతున్నది. ఈనాడు మానవునికి కావల్సింది వేదాంతం కాదు, సిద్ధాంతము కాదు, దాంతము కావాలి. దాంతులు కాక వేదాంతులు కాలేరు, దీనినే త్యాగరాజు బోధించాడు

" శాంతము లేక సౌఖ్యము లేదు
సారసదళనయనా
దాంతునికైనా వేదాంతునికైనా
శాంతము లేక సౌఖ్యము లేదు "

వేదాంతం వలన మనకు శాంతి లభించడంలేదు. సిద్ధాంతముల వలన మనకు శాంతి లభించడంలేదు. దాంతుడైనటువంటివాడే శాంతిని పొందగలడు. దాంతమనేటువంటి పురుషార్థంతో ఏర్పడేటువంటిది. ఇట్టి పురుషత్వంతో ఏర్పడేటువంటి యొక్క దాంతము యొక్క తత్త్వాన్ని మానవుడు సిద్ధాంతముగా అనుభవించడం లేదు. మానవత్వంలో ఏదో వెతుకుతున్నాడు అనంతకాలము నుండి, దేనిని వెతుకుతున్నాడో అతనికి తెలియదు. ఇట్టి వెతికేటటువంటి విషయ తత్త్వాన్ని గుర్తించుకోలేనటువంటి వ్యక్తులు ఈనాడు కోట్లకొలది మంది కలరు. భౌతికమైన, లౌకికమైన ప్రభావములకు మాత్రమే లొంగి తన నిత్య సత్యమైన స్వభావాన్ని మరచిపోతున్నాడు మానవుడు. ప్రభావమనేటువంటిది ప్రారబ్ధంతో ఏర్పడేటువంటిది, స్వభావమనే పురుషార్థంతో చేకూరేటటువంటిది. ఇట్టి పురుషార్థమును విస్మరించి, ప్రారబ్ధానికి లోబడి, మానవత్వాన్ని విస్మరించి, దానవత్వాన్ని అనుభవిస్తున్నాడు ఈనాటి మానవుడు. ప్రతి మానవుడు స్వార్థమే శ్వాసగా భావిస్తున్నాడు. పరాకృతమే ఒక ప్రాణముగా విశ్వసిస్తున్నాడు. అన్నిటియందును తనకే విజయం చేకూరాలని ఆశిస్తున్నాడు. ఈ విధమైనటువంటి వ్యక్తులు దినదినాభివృద్ధి పొందుతున్నారు. ప్రతి వ్యక్తియందును ఈ స్వార్థ స్వప్రయోజనాలే తాండవమాడుతున్నాయి. ఇలాంటివారు ప్రతిభాశాలురు కాగలరా? తెల్లవారి లేచిన లక్షణమే దిన, వార, మాస పత్రికలు; రేడియోలు, వీడియోలు, సినిమాలు – ఇలాంటి జీవితాన్ని గడపటానికి ఉత్సాహంగా ఊగుతుంటారు ఈనాటి మానవులు. అంతే కాదు కుల, మత, భాష, ప్రాంతీయ అభిమానములు వారియందు అమితంగా అభివృద్ధి అవుతున్నాయి. ఇలాంటి

వ్యక్తులు ప్రతిభావంతులుగా కావటానికి అవకాశమే లేదు. ఇట్టివారు ప్రతిభకు పట్టాభిషేకం కట్టగలరా?

ఈనాటి మానవుడు త్యాగం, శీలము, దమము- ఈ మూడింటి యందు తన జీవితాన్ని అంకితం గావించాలి. మానవుడు నిత్యమూ అనేకమందితో పరిచయం గావించుకొనుచున్నాడు వీరిలో కొందరు మిత్రులు, మరికొందరు శత్రువులు అసలు ఈ మిత్రత్వం, శత్రుత్వం ఎక్కడనుంచి వచ్చింది? ఈ రెండూ మానవుని మనసు నుండి ఆవిర్భవించినటువంటివే. ప్రతి వానియందునూ ఈ విధమైనటువంటి శత్రుత్వము, మిత్రత్వము దినదినాభివృద్ధి చెందుతున్నది. దీనికి కారణం ఏమిటి? రాముడు ఏ పాపం చేశాడు? ఏ దోషం చేశాడు? రాముడంటే రావణునికి మహా ద్వేషం. కృష్ణుని చూస్తే శిశుపాల దంతవక్త్రులకు మహాద్వేషం ఈ ద్వేషానికి మూలకారణమేమిటి? తాము ఆచరించిన దోషములే ఈ ద్వేషానికి మూలకారణం ఆ దోషములంతా వారియందే ఉన్నవిగాని, వీరి యందు లేవు. ధర్మమూర్తి అయిన ధర్మరాజు, అజాతశత్రువని పేరు గాంచిన ధర్మరాజు యెడల కూడనూ కౌరవులు శత్రుత్వాన్ని వహిస్తూ వచ్చారు. ఈనాటి లోకంలో శత్రుత్వం లేనటువంటి వ్యక్తులు కనిపించటంలేదు. దీనికి కారణము వీరు కాదు. ఎవరి భావములు వారికే కారణములు. కనుకనే మానవుని యందు తమతమ దోషములే తమతమ శత్రుత్వాన్ని పెంచుకుంటూ వస్తున్నాయి కనుక శత్రుత్వాన్ని గురించి మనం భయపడనవసరంలేదు. మిత్రత్వాన్ని అభివృద్ధిపరచుకోవటానికి తగిన కృషి చేయాలి. ఎవరు ఎన్నివిధములుగ దూషించినప్పటికినీ, విమర్శించినప్పటికినీ, పరిహసించినప్పటికినీ, ఏమాత్రం లెక్కచేయకూడదు, కారణమేమిటి? ఈ దూషణల వలన, విమర్శనల వలన, పరిహాసములచేత ఎవరికి నష్టము? ప్రతి వ్యక్తీ ఈ సత్యాన్ని గుర్తించాలి. దూషించేటటువంటి వ్యక్తి దూషింపబడేటటువంటి వ్యక్తి యొక్క పాపములను పరిహసించుచున్నాడు. కనుకనే పరిహసింపబడేటటువంటి వారి పాపములు, పరిహసించేవారిని చేరుతున్నాయి. ఏ వ్యక్తి పొగడుతున్నాడో, ఎవడు పొగడించుకొనుచున్నాడో, ఆ పొగడించుకొనేటటువంటివాని మంచితనమంతా పొగడే వానిలో చేరిపోతుంది. సత్యముగా మనము గుర్తించి వర్తించినప్పుడు మనలను దూషించేటటువంటివాడే మనకు మిత్రుడుగాని, పర్ణించేటటువంటివాడు మిత్రుడు కాదు, కారణం? దూషించేటటువంటివాడు మన దోషములను తాను తీసుకుంటున్నాడు. ఈ సత్యాన్ని ప్రతి వ్యక్తి కూడనూ చక్కగా గుర్తించాలి

కర్మమున బుట్టు జంతువు
కర్మమునె వృద్ధి పొందు, కర్మమున చనున్
కర్మమె నరులకు దైవము
కర్మమె సుఖదుఃఖములకు కారణమరయన్‌.

ఈ కర్మ అనేది మూడు విధములు. సంకల్పించడం ఒక కర్మ సంకల్పించిన దానిని అభివ్యక్తం చేసేటటువంటిది మరొక కర్మ. అభివ్యక్తం చేసినటువంటి కర్మను ఆచరించడం ఇంకొక కర్మ. కనుక సంకల్పమే మనసు. అభివ్యక్తం చేయడమే వాక్కు. అభివ్యక్తం చేసినటువంటిదానిని ఆచరించడమే హస్తం. కనుకనే శరీర మనోవాక్కాయముల యొక్క తత్వమే మానవత్వం ప్రతి మానవుని యొక్క సుఖదుఃఖములకు ఈ మూడే కారణం. ఈ మూడూ లేకుండా మానవుడు నిలవడానికి వీలుకాదు కనుక శత్రుత్వము, మిత్రత్వము అనేది మన మానసిక స్వభావమే. ఎవడు విమర్శిస్తాడో వాడే నిజమైనటువంటి మిత్రుడు ఈ దోషమునేటటువంటిది మనయందు లేదు. కనుక మనం ఈవిధమైన విచారణ సలిపి, సత్యాన్ని గుర్తించి,

మానవత్వాన్ని అభివృద్ధిపరచుకుంటూ రావాలి. ఎవరు చేసిన కర్మలు, ఎవరు చేసిన పాపములు వారినే అనుభవింప జేస్తాయి. ఎవరు చేసిన కర్మ యొక్క ఫలితమును వారే అనుభవింపవలసివస్తుందని మీరు గుర్తించాలి. ఎట్టి విత్తనమో అట్టి మొక్క, ఎట్టి తిండో అట్టి త్రేనుపు. కాబట్టి కర్మము మాత్రము తప్పునది కాదు. అయితే ఒక్క భగవదానుగ్రహంచేత దేనినైనా సాధించవచ్చును. అట్టి దివ్యమయిన అనుగ్రహం కోసం మానవుడు పాటుపడాలి.

కర్మ ఎప్పుడో ఒక పర్యాయం మనకు దాని ఫలితమందిస్తుంది. చేసిన తక్షణమే అందించేటటువంటి కర్మలు కొన్ని. కొన్ని నిముషముల తరువాత అందించేటటువంటివి కొన్ని. కొన్ని దినముల తరువాత అందించేటటువంటివి కొన్ని. కొన్ని సంవత్సరముల తరువాత అందించేటటువంటివి కొన్ని. కొన్ని యుగముల తరువాత అందించేటటువంటివి కొన్ని. ఉదాహరణకు : మనం నడుస్తుంటే కాలు జారింది. ఆ కర్మకు తక్షణమే ఎముక విరిగింది. జారటం, ఎముక విరగటం రెండూ ఒకే పర్యాయం జరిగింది. మనం ఏదో ఒక పనిచేస్తున్నప్పుడు మనకు కత్తి తగిలింది, తగిలిన తక్షణమే రక్తం వస్తుంది. ఆ కర్మకు తక్షణ ఫలితమే ఈ రక్తం ఇక రెండవది. కొన్ని గంటలు తీసుకుంటుంది. మనం భుజించిన భోజనం రెండు గంటల తరువాత అరుగుతుంది. రెండు గంటలు తీసుకుంటుంది ఈ కర్మ ఫలితం విత్తనం భూమిలో నాటితే, మొలక రావటానికి కొన్ని దినములు తీసుకుంటుంది. మొక్క వృక్షం కావాలంటే కొన్ని సంవత్సరాలు తీసుకుంటుంది ఆ వృక్షం ఫలాలివ్వాలంటే మరికొన్ని సంవత్సరాలు తీసుకుంటుంది. ఈ విధంగా కర్మఫలితము క్షణములు, గంటలు, దినములు, నెలలు, సంవత్సరాలుగా తీసుకుంటుంది. కాని కొంతమంది మూర్ఖులు, నేను దుర్మార్గమైన కర్మ చేసినప్పటికీ ఫలితమేమి చిక్కలేదేనను కుంటుంటారు. కాని ఉన్నది, ఈ కర్మఫలము తప్పునది కాదు. అయితే మూడు విధములైన కర్మలుంటున్నాయి. సుకర్మ. 2. వికర్మ 3. అకర్మ 1 సుకర్మ అనగా మంచి కర్మల ఫలితము. మంచి పనులు చేయించడం, మంచి పనుల యొక్క ఫలితము మంచిగానే అందించడం. 2. వికర్మ అనగా చెడ్డ కర్మలు చేయించడం. ఆ చెడ్డకర్మల ఫలితము తరువాత చెడ్డగానే అందించడం. 3. అకర్మలు ఎట్టి కర్మను చేయకపోయినప్పటికినీ అది ఒక కర్మరూపంగా వస్తుంటుంది. ఇది పూర్వజన్మ సుకృతము, పూర్వజన్మ కర్మల ఫలితమని చెప్పవచ్చును. సీతాదేవి ఏ చెడ్డ కర్మలు చేయలేదు. కాని అరణ్యములో పడి పతి వియోగంతో అశోకవనంలో దుఃఖించడానికి కారణమేమిటి ? సత్యహరిశ్చంద్రుడు ఎలాంటి పాపకర్మలు ఆచరించనప్పటికినీ భార్యను అమ్ముకొని, బిడ్డను కోల్పోయి, కాటికాపరిగా వుండటానికి కారణమేమిటి ? నలదమయంతులు ఒకరినొకరు వీడిపోయి దుఃఖమును అనుభవించడానికి కారణమేమిటి ? ఇది సుకర్మ కాదు, వికర్మ కాదు అకర్మ ఎట్టి కర్మలు చేయకపోయినప్పటికిని జన్మాంతర కర్మలనేటటువంటివి ఈ విధమైన పరిణామాన్ని తెప్పిస్తుంటాయి కనుక మానవత్వములో వుండినటువంటి ఈ విశిష్టతను చక్కగా గుర్తించటానికి ప్రయత్నించాలి ఏ చిన్నదానిని నీవు అనుభవించినప్పటికిని, ఇది కర్మల యొక్క ఫలితమే. ఇది ఎప్పటికీ తప్పనిది కాదు. తప్పనిది కాదు కాబట్టే తప్పించుకోవడానికి తగిన ప్రయత్నం చేయాలి ఏ విధంగా ? భగవంతుని యొక్క అనుగ్రహమును పొందాలి, పాత్రులుకావాలి. ప్రతి మానవుడు లోపల సత్సంకల్పాలను పెంచుకుంటూ రావాలి.

సత్యం, ప్రేమ, శాంతి, కరుణ, సహనం - ఇత్యాది మంచి భావములను హృదయములో ఆవిర్భవింపచేసుకొనినప్పుడు, జీవితం సుందరమైన నందనవనంగా రూపొందుతుంది. కాని దుర్మార్గము దుష్టత్వం, దురాలోచన పాపము - ఇలాంటి దుష్ట

సంకల్పములను తన హృదయములో ప్రవేశించు కున్నటువంటి వానికి, కేవలం మలమూత్ర దుర్గంధము లతో కూడినటువంటి 'వైతరణీ' నదిగా ప్రవహిస్తుంది ఎవడికి వాడు విచారించుకోవచ్చును. నేను సుందరమైన నందనవనమునా ? లేక వైతరణీనదినా ? అని తన యొక్క సంకల్పాలకు తగినట్లుగా గుర్తించుకోవచ్చును. తన భావములు తనకు మాత్రమే తెలుసు ఇతరు లెవరూ గుర్తించటానికి వీలుకాదు చెడ్డ భావములు ఉండటంచేతనే, వాడు తెలియనటువంటి వైతరణీ నదిలో పడిపోతున్నాడు మంచి భావములు వుండటంచేతనే సుందరమైన నందనవనంగా రూపొందుతున్నాడు కనుక ఎవరికివారే సాక్షి. కనుక ఇంకొకరు సాక్షి యివ్వ నవసరంలేదు "మనసుకు మనసు సాక్షి, మనిషికి గుణము సాక్షి, ముఖానికి ముఖం సాక్షి, ఎవరికివారే సాక్షి - దీనినే ఆత్మసాక్షి" అని అంటున్నారు. కనుక మనం తప్పులుచేసి ఒప్పు లుగా మనం Act ( నటించు ) చేయవచ్చును కాని అభినయంలో మంచిగా కనిపించవచ్చును గాని, లోపలి దోషములు విన్ను చాలా హింసిస్తూ ఉంటాయి అలాంటి వానిని ఎవరూ ఏమాత్రము కూడనూ ఇచ్చగించరు అయితే ఎట్టి దోషములూ లేని, ఎట్టి పాపములు లేని దివ్యత్వాన్ని ప్రేమిస్తుంటారు అట్టి వారు కూడనూ అనేక దుఃఖములకు, కష్టములకు గురి అవుతున్నట్లుగా కనిపిస్తున్నది ఇది కాదు. కేవలం మన పాపములను మనలను దూషించేవారు తీసుకోవచ్చునని చెప్పవచ్చును మన పుణ్యములు మనలను పూజించేవారు తీసుకోవచ్చు నని చెప్పవచ్చును కాని భగవంతుని దూషించేటటు వంటివారు ఏమి తీసుకుంటున్నారు ? భగవంతునిలో పాపములేదు పుణ్యమూలేదు.

కనుక భగవంతుని దూషించేటటువంటివానిని గాని, ప్రేమించేటటువంటి వానిని గాని, పరిహసించేటటువంటి వానిని గాని "శివోఽహం ... శివోఽహం ... మంగళం ... మంగళం" అని అంటుంటాడు భగవంతుడు. కంసుడు నిరంతరమూ కృష్ణుని దూషిస్తూ వచ్చాడు. నిజమైనటువంటి భగవంతుని చూచినప్పుడో, పూజామందిరంలో ప్రవేశించినప్పుడో - ఆ భగవంతుని స్మరిస్తారు. భగవంతుని ద్వేషించేవారు నిరంతరము భగవంతుని దూషిస్తునే ఉంటారు అనగా నిరంతరం 'దూషణ' అనే పేరులో భగవంతుని స్మరిస్తున్నారన్న మాట కనుకనే ద్వేషి అయిన కంసుని రక్తం కట్ట కడపటికి కృష్ణునియొక్క పాదాలపైన పడింది అదే విధంగా శిశుపాలుని రక్తం కూడా కృష్ణుని పాదాలపైన పడింది శిశుపాలుడు కృష్ణుని అనరానిమాటలన్నాడు. ఎంతో కఠినంగా దూషించాడు.

"స్నానంబుచేయు ఆ జవరాండ్ర చీరలు
దాచేసినందుకా పూజ నీకు
గొల్లపూబోండ్లతో జల్లులాడిననాడు
హర్షించినందుకా అర్ఘ్యమిడుట"

కట్టకడపటికి తన వాక్కే తనకు ప్రతిఫలంగా రూపొందింది. కనుక భగవంతుని యొక్క తత్త్వము అర్థము చేసుకోలేనటువంటి మూర్ఖులు, ఏదో మేము విమర్శిస్తున్నామని ఆనందిస్తున్నారే గాని, ఆ విమర్శలే ఏదో ఒక రూపంలో వెంటాడుతునే ఉంటాయి. "ఎవరు చేసిన కర్మ వారనుభవింపక ఏరికైనను తప్పదన్నా ..." అనే విషయం విస్మరించరాదు. అయితే ఈ కర్మలను పరిహారం గావించుకొనే నిమిత్తమై, వారు సత్కర్మలలో ప్రవేశించాలి ఈ సత్కర్మలు, ఎంతటి పర్వతములైనటువంటి పాపముల నయినా పరిహారం చేస్తాయి. పర్వతములవలె వచ్చి నటువంటి దుఃఖములను మంచువలె మాయం చేస్తాయి. భగవంతుడు సంకల్పించుకుంటే ఏమైనా చేయవచ్చు. అయితే భక్తుని యొక్క భక్తిభావములను ఆధారం చేసుకొని భగవంతుడు సంకల్పించుకుంటాడు. కనుక

( తరువాయి 34 వ పేజీలో )

# స్థితప్రజ్ఞతకు కొన్ని ఉదాహరణలు

-పాతూరి ప్రసన్నం

మనస్సుకు సంబంధించిన ఎన్నో విలువలను ఒక్క మాటలో వివరించే పదమే స్థిత ప్రజ్ఞత !

ఓర్పు, సహనం శ్రద్ధ, సమానత్వం, సరళత, సామ్యావస్థ, ప్రశాంతత వంటి అనేకమైన అనుభూతులు 'స్థిత ప్రజ్ఞత' అనే మాటలోనే యిమిడి వున్నాయి.

ఒక విధంగా మనస్సుమీద విజయాన్ని సాధించిన స్థితినే స్థిత ప్రజ్ఞ అంటారు.

తెలివితేటల్ని పెంచుకోవటం, పెద్దపెద్ద పదవులూ, క్వాలిఫికేషన్లు తెచ్చుకోవటానికీ మనస్సును ఆధీనం లోకి తెచ్చుకోవటానికీ సంబంధం లేదు. దానికి అదే, దీనికి యిదే ఆధునిక యుగంలో మనిషి యొక్క వైజ్ఞానిక చింతన, తెలివితేటలు విపరీతంగా పెరుగుతున్న మాట నిజమే ! పెద్ద సైంటిస్టు కావచ్చు, మహా రచయిత కావచ్చు, గొప్ప యింజనీరు కావచ్చు, గొప్ప నాయకుడు కావచ్చు కానీ వారి మనస్సు వారి ఆధీనంలో లేకపోవటంతో వారి ప్రవర్తన వారికే కాక, సమాజానికూడా అరిష్టదాయకంగా వుండటం ఈ నాగరిక యుగంలో గల వైపరీత్యం అటువంటి మేధావులకన్న ఏమీ చదువుకోని సామాన్య వ్యక్తులు, పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోలేని సాధారణ వ్యక్తులూ తమ మనస్సులను తాము అదుపులో వుంచుకొని ధన్య జీవనులు అవుతున్నారు, అంటారు 'Man the unknown' లో ఎలెగ్జిస్ క్యారల్ ! కాబట్టి తెలివితేటలకూ స్థితప్రజ్ఞతకూ సంబంధం లేదనే చెప్పాలి

## ఒక ప్రయోగం

అమెరికాలోని మన్‌హట్టన్ ఎడారుల్లో మొట్టమొదటిసారిగా అణు బాంబును బ్రద్దలు చేసి దానియొక్క వినాశకర శక్తిని పరీక్షించటానికి కూర్చున్నారు సైంటిస్టులు వారిలో అణుశాస్త్రజ్ఞుడు ఓపెన్ హామల్ ఒకరు వారికొక భయంకరమైన సందేహం కలిగింది. 'అంచనా మించిన రీతిలో విధ్వంసం జరిగితే మనం ఏమైపోతాం?' అనే భయం వారందరినీ పట్టుకొని పీడించుతోంది. వారంతా ఎడారిలో అణువును బ్రద్దలు చేసే మొట్టమొదటి ప్రయోగాన్ని చూడటం కోసం ఒక సురక్షిత ప్రాంతాన్ని నిర్ణయించి అక్కడ కూర్చున్నారు కొద్దిక్షణాల్లో అణువు బ్రద్దలు కాబోతున్నది మానవ మేధస్సు సాధించిన ఈ అఖండ విజయం సుఖాంతమవుతుందో, కళ్ళఎదుటనే దుఃఖాంతం అవుతుందో సైంటిస్టుల ఊహకు అతీతంగా వుంది. అప్పుడు ఓపెన్ హామల్‌గారు భగవద్గీతలో 11 వ అధ్యాయంలో గల విశ్వరూప సందర్శనను వర్ణించే శ్లోకాలను, 2 వ అధ్యాయంలో గల స్థితప్రజ్ఞుని వర్ణించే శ్లోకాలనూ బిగ్గరగా చదువుతూ కూర్చున్నారుట ! అలా వాటిని చదవటంచేత వారి మనస్సు, ఉద్రేకాలూ, బ్లడ్ - ప్రెజరు అదుపులో వున్నాయిట ఈ రీతిగా వారు తాత్కాలికంగానయినా స్థితప్రజ్ఞత్వాన్ని అనుభవించారు.

అలాగే ఒక సూపర్ సానిక్ జట్‌లో కూర్చొని, ఫ్లయిట్‌ను ప్రారంభించబోయే పైలట్‌గారూ, కొన్ని గంటల వ్యవధి తీసుకొనే ఒక మేజర్ ఆపరేషన్ చేయబోతున్న సర్జన్‌గారూ, ఇంకా యిలాటి వారంతా కొద్ది సేపు తమ మనస్సులను ప్రశాంతంగా, స్థిమితంగా వుంచుకొనేందుకు ధ్యానమో, దైవప్రార్థనో, అటు

వంటివే మహాకటో చేసి తమ అసాధారణమైన చర్యకు పూనుకుంటారు ఒక జట్ ప్లేన్‌ను ఆపరేట్ చేయటం, ఒక సీరియస్ ఆపరేషన్ చేయటం మనకు అసాధారణ చర్యలే అయినా వారికి అతి సాధారణ చర్యలే అయిపోతాయి. వాటిని నిర్వహిస్తూ వుండగా వారంతా స్థితప్రజ్ఞులే అయిపోతారు.

## నిత్యజీవితంలో స్థితప్రజ్ఞత

మనస్సును స్థిమితంగా వుంచి బ్రతకటం ప్రతి మనిషికీ చాలా అవసరం. దానివల్ల మానసికమైన ఆరోగ్యం పెంపొందుతుంది. మనస్సు ఆరోగ్యంగా వుంటేనే శరీరం ఆరోగ్యంగా వుండటం. ఎటువంటి సవాలు చేసే సందర్భం ఎదురయినాసరే, మనస్సును ఉద్రేకపరచకుండా ఆ సందర్భాన్ని ఎదుర్కోవటం మనం అలవరచుకోవాలి క్రమంగా ఈ సాధన మనల్ని స్థితప్రజ్ఞులను కావిస్తుంది మనం ఊపిరి పీల్చటం, ఊపిరి విడవటం అనే ప్రక్రియను చివరి ఊపిరి వరకూ చేస్తూనేవుంటాం. ఈ విధమైన ఉచ్ఛ్వాస, నిశ్వాసాలను నెమ్మదిగా, దీర్ఘంగా చేసే అలవాటు సాధించాలి. మనస్సును నిలకడగా వుంచటంలో ఇదొక అద్భుత సాధన ! కోప, తాపాలతో, ఉద్రేకాలతోనూ ప్రవర్తించే ప్రతి మనిషికీ ఆ సందర్భంలో చాలా వేగంగా గుండె కొట్టుకుంటుంది, ఉచ్ఛ్వాస, నిశ్వాసలూ చాలా వేగంగా సాగుతూ ఉంటాయి. కానీ ప్రతిరోజూ ఒక సాధనగా తన ఉచ్ఛ్వాస నిశ్వాసలకు మెల్లగా, క్రమంగా, సుదీర్ఘంగా తీసుకోగలిగిన వ్యక్తి సాధారణంగా మానసికమైన ఈ సామ్యతను (Balance) కోల్పోడు. ఇది ఈ రచయిత యొక్క వ్యక్తిగతమైన అనుభవంకూడా!

అవతల వ్యక్తి చాలా వేడిగా, ఉద్రిక్తతతో మాట్లాడుతూవుంటాడు ఆ వేడిలో ఏమి ఆరోపణలు చేస్తున్నాడో ఏమి అంటున్నాడో అతనికే తెలియదు. కాబట్టి అటువంటి వ్యక్తితో వ్యవహరించే సమయంలో మనము ముందుగానే మన మనస్సు ఉద్రిక్తత చెందకుండా జాగ్రత్తపడాలి. అవసరం అయితే చల్లని నీళ్ళతో ముఖం కడుక్కోవటం, చల్లటి నీరు ఒక గ్లాసు త్రాగటం, పైన వివరించిన ఉచ్ఛ్వాస, నిశ్వాసల Exercise చేయటం ద్వారా స్థిరమైన ప్రజ్ఞతో వ్యవహరించవచ్చు ఒకవేళ యింకా అటువంటి స్థైర్యం మన మనస్సుకు చిక్కకపోతే తాత్కాలికంగానయినా మన ఆలోచనలను నిలిపివేయాలి మాట్లాడటం మానుకోవాలి. అటువంటి వేడిలో ఏ నిర్ణయమూ తీసుకోరాదు, అనే జాగ్రత్తలు తీసుకోవటం మంచిది.

## అయినాసరే ఒక్కోసారి బ్యాలెన్సు తప్పితే ఏం చేయాలి ?

చిన్నపిల్లవాడు నడక నేర్చుతూ వున్నప్పుడు క్రింద పడుతూవుంటాడు. మరల లేచి నిలబడి నడుస్తూ వుంటాడు అదే రీతిగా ఒక్కోసారి క్షణికంగా ఒక ఉద్రేకానికి లోనై స్థిరత్వాన్ని కోల్పోతే ఏంచేయాలి ? అనే ప్రశ్నకు సమాధానం కావాలి కదా ! అందుకు పశ్చాత్తాపం చెంది, అవసరం అయితే అలా మానసిక స్థిరత్వాన్ని కోల్పోయినందుకు అవతల వ్యక్తికి క్షమాపణ కూడా చెప్పుకోవాలి. తప్పదు మరి.

ఒకసారి మన దేశానికి ప్రప్రథమ అధ్యక్షుడు అయిన బాబూ రాజేంద్ర ప్రసాద్ తన స్థయిర్యాన్ని కోల్పోయారు ఆ సంఘటన యిది. వారిని బాల్యం నుంచీ కనిపెట్టి, తన స్వంత బిడ్డవలె సేవచేసే ఒక వృద్ధుడు వారి పరివారంలో ఒక వ్యక్తి వున్నాడు. రాజేంద్రప్రసాద్‌గారి గదినీ, టేబులును, కాగితాలనూ తుడిచి శుభ్రంగా వుంచే పని అతనిదే ! ఒకసారి అజాగ్రత్తచేత భారత దేశాధ్యక్షులవారికి జపాన్ రాజు బహూకరించిన ఒక అమూల్యమైన పెన్ను ఆ వృద్ధుని చేతి నుంచి జారిపడిపోయి, విరిగిపోయింది. రాజేంద్రప్రసాద్ ఆ వృద్ధుని కోపోద్రేకంతో తిట్టాడు. తల వంచుకొని వృద్ధుడు వెళ్ళిపోయాడు కానీ ఆ రోజు రాత్రి పడుకోబోయే ముందు రాజేంద్రప్రసాద్ ఆ

సంఘటనను గుర్తుకు తెచ్చుకొని తనకు తానే అవమానంతో సిగ్గుపడిపోయాడు "కన్న తండ్రివలె నా యోగక్షేమాలను చూచే పెద్దమనిషివి, Afterall ఒక పెన్ను విరిగినందుకు అలా తూలనాడాను. పోయిన పెన్ను గొప్పదే కావచ్చు. కాని అంతకంటే విలువైన వ్యక్తి ఈ వృద్ధుడు అనుకొని బాధపడుతూ, అతనిని పిలిపించి, క్షమార్పణ కోరారు. అప్పుడుగానీ వారు నిద్రపోలేదు.

ఈ రీతిగా మనస్సుకు నిత్యజీవితంలో తగిన శిక్షణ యివ్వగలిగినప్పుడు ప్రతి మనిషీ స్థితప్రజ్ఞుడవుతాడు. దిగజారిపోతున్న మనస్సును సాక్షీభూతుడుగా (Witness) ఎవరికి వారే గుర్తించటం నేర్చుకోవాలి. అప్పుడు ప్రజ్ఞస్థితమవుతుంది. స్థిరమవుతుంది.

## సానుభూతి, ప్రేమ కల మనస్సులు కావాలి

నిజ జీవితంలో సానుభూతి ప్రేమ, సర్దుబాటు చేసుకోవటం, ( Adjustment ) పరిస్థితులకు అనువుగా మనస్సును సరిదిద్దుకోవటం (Adoption)వంటి లక్షణాలు అలవడితే మనస్సుయొక్క సమత్వం తేలికగా లభిస్తుంది 'నా మొండితనం నేను వీడను' 'నేను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళు' అనే ధోరణిలో మనస్సు ఎన్నడూ స్వాధీనంలోకి రాదు ఒకసారి మేడం బ్లావట్స్కీ ( థియోసఫీ సొసైటీలో ప్రపంచ విఖ్యాతురాలు ) ఒక స్టీమరు ప్రయాణానికి వెళ్తోంది. ఫస్టుక్లాసులో టిక్కెట్టు తీసుకున్నది ఆ అమ్మగారు స్టీమరు ఎక్కబోతూ వుండగా ఒక తల్లి తన బిడ్డలతో ఏడుస్తూ కనిపించింది. ఎందుకు ఏడుస్తున్నావు ? అని అమ్మగారు అడిగారు. 'ఒక మోసగాడు స్టీమరు టిక్కెట్టు తెస్తానని డబ్బు తీసుకొని పారిపోయాడు. నేనూ నా బిడ్డలు ఈ స్టీమరులోనే పోవాలి మా వద్ద డబ్బు లేదు' అని ఆమె విలపించింది వెంటనే బ్లావట్స్కీ అమ్మగారు తన ఫస్టుక్లాసు టిక్కెట్లు వాపసుచేసి, అందరికీ డెక్ (Deck) మీద పయనించే టిక్కెట్లుకొన్నారు. సుఖంగా



ఫస్టుక్లాసుకు వెళ్ళగలిగిన అమ్మగారు వారితో పాటు ఎండకూ వానకూ యిబ్బంది పడుతూ నేలపైన పడుకుంటూ ఆ బడుగుజీవులతోనే ప్రయాణం చేశారు ! తోటి మనుష్యుల పట్ల సానుభూతి, ప్రేమ అనేవి మనల్ని ఈ రీతిగా స్థితప్రజ్ఞుల్ని కావిస్తాయి హంసతూలికా తల్పంపైన పడుకోవచ్చు, తప్పులేదు కానీ అవసరం అయితే కటిక నేలపైన కూడా హాయిగా పడుకోగలగాలి. పంచభక్ష్య పరమాన్నములతో భుజించవచ్చు. కానీ అవసరం అయితే ఒక పండునో, ఫలమునో భుజించి పనిచేసుకోగలగాలి ఎయిర్‌కండీషన్ గదిలో వుండవచ్చు. కార్యసాధనలో ఎండా, వానా లెక్కించక పనిచేయగలగాలి. కాబట్టి యిటువంటి సాధననే నిత్యజీవితంలో స్వీకరించటంద్వారా క్రమంగా మన ప్రజ్ఞ కూడా స్థిరమవుతుంది.

ఈ సందర్భంలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి సేవాసంస్థలలో సేవ చేస్తున్న సేవకుల యొక్క ప్రవృత్తినీ, ప్రకృతినీ పరిశీలించడం చాలా అవసరం. వారంతా సమాజ సేవలో నిమగ్నులయిపోతారు. క్రమ

శిక్షణతో, చిరునవ్వుతో, శ్రమపడి సేవచేయటం తమకు భగవంతుడిచ్చిన ఒక అద్భుత సాధనగా సేవలు జరుపుతూవుంటారు ! ఎండ, వాన, ఆకలి, దప్పిక, విశ్రాంతి, నిద్ర అనేవి కూడా చూడకుండా తమ సేవా కార్యక్రమాన్ని దీక్షతో, భక్తి శ్రద్ధలతో నిర్వహిస్తారు. ఈ సాధనయొక్క ప్రతిఫలమే వారిలోని ప్రజ్ఞ స్థిరత్వం చెందటం ! వారి మనస్సులు ఆ సేవాసాధన ద్వారా సరళమైనవిగా, ఒక సమత్వమును ధరిస్తాయి ! ఈ సమత్వమే యోగం అంటుంది గీత !

నిత్య జీవితంలో ఈ రీతిగా మనస్సును ఆందోళనల పాలు చేయక, ప్రశాంతంగా, నేర్పరితనంతో, సమదృష్టితో బ్రతకగలగటం కేవలం ఆధ్యాత్మిక వికాసానికే కాదు, లౌకిక జీవితంలో ఉన్నతికికూడా ఎంతో అవసరం.

భయంకరమైన పరిస్థితులు సంసారాల్లో ప్రబలినప్పుడూ చుట్టూ అనుకూలత లేని వాతావరణం నిజ జీవితాల్లో అలుముకొన్నప్పుడు నిందలూ, నిష్ఠూరాలూ కారణంగా మనపైన విరుచుకు పడుతున్నప్పుడూ, ఏడుస్తూ కుమిలిపోతూ దైవకృపకోసం ప్రార్థించటం సహజమే ! కానీ ఆ దైవ కృపే వీటిని భరించే మానసిక స్థైర్యంగా మనలో ప్రకాశించుతుంది, అని గుర్తిస్తే చాలు ! ధన్యులం! మనమూ స్థితప్రజ్ఞులం అయినట్లే.



# ఎచ్చోటనైనా విస్ఫులింగం ఉండవచ్చు

ఒకనాడొక సుప్రసిద్ధ కళాకారుడు, తన గ్రామ పరిసరాల్లో నున్న పొలాలవైపు వ్యాహ్యాళికెళ్తూ ఒక బాలుని చూచి నిర్ఘాంతపోయాడు. అతను గొర్రెల కాపరి. గొర్రెలు పచ్చికను మేస్తున్నాయి. ఆ బాలుడు సమీపంలోనున్న రాతిఫలకం మీద ఏదో చిత్రం గీస్తున్నాడు. అతను చుట్టు ప్రక్కల లభ్యమయ్యే చవుకబారు రంగులనే ఉపయోగిస్తున్నాడు ఏదో తన చేత్తో తయారుచేసుకున్న కుంచెతోనే చిత్రిస్తున్నాడు. కాని ఆ చిత్రణలో అపూర్వ కళానైపుణ్యము కొట్టొచ్చినట్లు ప్రస్ఫుటమవుతూఉంది. వెంటనే ఆ చిత్రకారుడు ఆ బాలుని తన ఇంటికి తీసికొనివెళ్ళి అతనికి వలసినవన్నీ ఇచ్చి, పెంచి పెద్దజేసి తనకు వచ్చిన చిత్రలేఖనమును నేర్పెను. అతనిలో నిద్రాణమైయున్న తెలివి ఒక్కసారి జ్వలించింది. అతడు ప్రపంచ ప్రఖ్యాతినందిన చిత్రకారులలో ఒకడనిపించుకొనగలిగాడు.

చాలామంది మనలో తరచు ఈ విధంగా అనుకుంటుంటారు. 'నాకే గనక వాడికున్న అవకాశాలుంటేనా?' 'నాకే గనుక అతనికున్న శక్తిసామర్థ్యాలుంటేనా?' - 'నాకు వీణ వాయించటం ఎంతో ప్రీతి, అసలు నాకు నేర్పిస్తేనా' - ఇంకా ఎన్నో ఎన్నో 'ఉంటే చాలు' ఈ విధమైన పనికిమాలిన ఇచ్ఛలతోను అసూయాద్వేషాలతోను, నిరాశానిస్పృహలతోను, జీవితాలను నిరర్థకం చేసుకుంటుంటారు. జాగ్రత్తగా పరిశీలిస్తే యదార్థానికి, ఎవరి తెలివితేటల్ని చూచి వారు ఈర్ష్య పడుతుంటారో అవి తమలోనే నిగూఢంగా ఉండవచ్చు

మనిషిలోని సత్తా కార్యరూపం దాలిస్తే తప్ప తెలియదు మనము ఏ పనినైనా చేయటం ప్రారంభిస్తే నే మనకున్న శక్తి మనకు తెలిసేది. ఆ పనిని చేయటం సాగిస్తే, మనం కోరుకుంటున్న శక్తిని పెంపొందించుకోగలుగుతాం.

ఏది మనం చేసినా. దానిని ప్రార్థనాపూర్వకంగా, వినమ్రతతో, సక్రమంగా, మనస్ఫూర్తిగా చిత్తశుద్ధితో చేయావలెనే గాని పరాత్పరుడు మనకు ఫలమీయకపోడు.

- కామరాజు సరోజినీదేవి

# తెల్లవారికి పెరుగుతున్న నల్లమోజు

కె. ఆర్. కె. మోహన్

శ్రీకృష్ణుడు నల్లనివాడే కాని భువన మోహనా కారుడు అందుకే యావద్గోపికాజనం ఆయన వెంట పరుగులు తీసింది. ఐరోపా దేశీయులైన తెల్లవారికి నల్లరంగు అంటే కంటగింపు. అందుకే నల్లనివారైన ఆసియా దేశస్థులను నీచంగానూ, అమిత నల్లగా ఉండే ఆఫ్రికా ఖండస్థులైన నీగ్రోలను పరమ నీచంగానూ చూస్తూ వర్ణవివక్ష పాటించేవారు. ఇప్పుడు ఈ పరిస్థితి చాలావరకు మారినా నల్లవారిపట్ల ఏవగింపు ఇప్పటికీ దక్షిణాఫ్రికా, అమెరికాలోని దక్షిణ రాష్ట్రాలు వంటి వాటిలో ఎక్కువగానే ఉంది. న్యూజిలాండ్ వాసులు స్వతహాగా బ్రిటిష్ సంతతివారైన తెల్లవారు - వర్ణ వివక్ష పాటించినవారు. అయితే గత పదిపదిహేనేళ్లుగా న్యూజిలాండ్ వాసులకి నల్లరంగుపట్ల మోజు అంత కంతకీ పెరుగుతోంది ఇది ఎంతగా పెరిగిందంటే కావాలని ఎండలో గంటలపాటు గడిపి వంటిని నల్లగా కమలగొట్టుకునేంతవరకు వెళ్ళింది వారిలో కలిగిన అభిప్రాయం ప్రకారం తెల్లగా ఉంటే జబ్బుతో ఉన్నట్లు లెక్కట నల్లని శరీరంతో నిగనిగలాడుతుంటే దృఢంగా ఆరోగ్యంగా ఉన్నట్లు లెక్కట అంతేకాదు. అటువంటి వారినే ఆకడి అంగనామణులు అభిలషిస్తున్నారటకూడా.

న్యూజిలాండ్ వాతావరణం కలుషితమైనది కాదు స్వచ్ఛంగా ఉంటుంది నిజానికి ఇది వరమే అయినా ఇందువల్ల అనర్థం కూడా ఉంది. అదేమిటంటే సూర్యుని నుంచి వచ్చే తీక్షణమైన కిరణాలు ముఖ్యంగా అల్ట్రా వయొలెట్ రేస్ ఏ ఆటంకం లేకుండా ప్రసరించి మనుష్యుల మాడుని మాడగొట్టుతుంటాయి. ఆ కారణంగా చర్మ కాన్సర్ వచ్చే అవకాశం ఎక్కువ. న్యూజిలాండ్ స్కిన్ క్యాన్సర్ విషయంలో ప్రపంచంలోనే అగ్ర గామిగా ఉంది. ప్రతి పది సంవత్సరాలకి ఈ కేసులు రెట్టింపు అవుతున్నాయట. ప్రస్తుతం ఇవి సాలీనా వెయ్యికి పైగా ఉంటున్నాయి.

స్కిన్‌క్యాన్సర్‌లో "మాలిగ్నెంట్ మెలనుమా" అనేది అతి ప్రమాదకరమైన రకం ఇది సూర్యస్నానం మూలంగా వస్తుంది. సూర్యస్నానం అంటే ఏమిటో అనుకునేరు. కేవలం ఒంటిమీద అండర్‌వేర్, కళ్ళకి నల్ల అద్దాలు ఉంచుకొని ఎండలో పడుకోవడమన్నమాట. ఇది పాశ్చాత్య దేశాలలో పరిపాటి (మన దేశంలో కూడా 'అల్ప స్నానం' అని ఉంది. దీనిలో వంటికి ఒండ్రుమట్టి పట్టించుకొని పచ్చితామర ఆకులు వంటిమీద కప్పుకొని ఎండలో పడుకోవడం. ఇది ప్రకృతి చికిత్సలో ఒక భాగం. న్యూజిలాండ్‌లో స్కిన్‌కాన్సర్ వల్ల మరణించేవారి సంఖ్య రెండువందలు పైన ఉంటుందట పైగా ఇది 20-40 సంవత్సరాల మధ్య వారిలోనే ఎక్కువ ఉంటోందట. అందువల్ల ఈ వ్యాధిని అరికట్టేందుకు ప్రచార సాధనాలద్వారా జాగ్రత్తలు తెల్పడం ముమ్మరం చేశారు. ఎండలో బట్టలు లేకుండా తిరగడం ప్రమాదకరమని హెచ్చరిస్తున్నారు అలాగే పెద్దలకీ, ఉపాధ్యాయులకీ కూడా తమ పిల్లల్ని ఎక్కువసేపు ఎండలో ఉండనీయవద్దని సలహా ఇస్తున్నారు. న్యూజిలాండ్ కాన్సర్ సొసైటి మరో హెచ్చరిక చేసింది. చిన్నతనంలో ఎండలో వంటిని కమలగొట్టుకుంటే పెద్దయ్యాక అది మెలనుమాకి దారితీయవచ్చునట ఈ సొసైటీ అధ్యక్షుడు డాక్టర్ అలాన్ గ్రౌ మెలనుమాని ముందుగానే గుర్తించి చికిత్స

చేస్తే 90 నుంచి 95 శాతం కేసులను నయం చేయ
ఎచ్చునని భరోసా ఇచ్చారు. ఒంటిమీద చారలు కాని మచ్చలుకాని వచ్చినట్లయితే అది మెలనుమా కావచ్చునని అనుమానించి వెంటనే వైద్యుని సంప్రదించడం అవసరమని ఈయన సలహా ఇస్తున్నారు పీటిని నిర్లక్ష్యం చేస్తే వ్యాధి లోపలికి పాకి నయం చేయడం క్లిష్టం కావచ్చుననీ, అది క్రమేపీ వివిధ అవయవాలకు కూడా సోకవచ్చుననీ ఈయన హెచ్చరించారు. తప్పనిసరిగా సూర్యస్నానం చేయాలనుకునే వారికి, వారు మధ్యాహ్నం 11 నుంచి 3 గంటల మధ్య ఎండలో ఉండకూడదని ఈ కాన్సర్ సొసైటీ సూచించింది. ఎందుకంటే ఈ సమయంలో వచ్చే సూర్యకాంతిలో ప్రమాదకరమైన కిరణాలు అత్యధికంగా ఉంటాయి సూర్యస్నానాన్ని కోరేవారు ఎండనుంచి రక్షించే క్రీములు, లోషన్‌లను వాడటం కూడా మంచిదని ఈ సంస్థ సలహా ఇచ్చింది.

ఒళ్ళు కమలడమనేది కేవలం ఎండవల్ల మాత్రమే రాదు. కొంత కాలంగా న్యూజిలాండ్‌లో ఆర్టిఫిషియల్ టానింగ్ క్లినిక్‌లు కుక్కగొడుగులలాగ వెలిశాయి. ఇవి అల్ట్రావయొలెట్ సోలేరియంలద్వారా శీతాకాలంలో కూడా ఒళ్ళు కమిలేటట్లు చేస్తాయి. కాన్సర్ ద్వారా చర్మం దెబ్బతినడానికి మామూలుగా 30–40 సంవత్సరాలు పడుతుంది అందువల్ల ఈ క్లినిక్‌లలోని పద్ధతులు ఎంతటి సురక్షితమైనవో అప్పుడే చెప్పడం సాధ్యం కాదని కాన్సర్ సొసైటీ అభిప్రాయం వ్యక్తం చేసింది. డాక్టర్ గ్రే ఉద్దేశం ప్రకారం చర్మానికి ఏ విధంగా టానింగ్ కల్పించుకున్నా అది రేడియేషన్ మూలంగా చర్మాన్ని గాయపరచడమే అవుతుంది ఈ విషయంలో పరిశోధనలు జరిపిన కొందరు అమెరికన్ వైద్యులు టానింగ్ చర్మానికి ఎంతమాత్రం మంచిది కాదన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు వారు టానింగ్ అందానికి చిహ్నం అన్న అభిప్రాయాన్ని మార్చుకోవాలని న్యూజిలాండ్ ప్రజలకు సూచించారు.



# గడ్డిని తిన్న మహానాయకులు

గడ్డి తినడమంటే ఏదో చెడ్డ పనులు చేయడమనుకోవద్దు నిజంగా గొప్ప నాయకుడు గడ్డిని నలుగురికోసం తినవలసివచ్చింది ఆ సంఘటన తెలుసుకుందాం! అతని గొప్పదనం శ్లాఘిద్దాం!

బర్మా దేశపు సరిహద్దులలో బ్రిటిష్‌వారితో మన సైన్యం పోరాటంసాగిస్తున్న రోజులవి. కెప్టెన్ సైన్యాన్ని ధైర్యంగా నడుపుతున్నాడు. ఆ సమయానికి వారి నాయకుడు కూడా వీరితోనే వున్నాడు

అనుకున్నట్లుగా వీరికి జపాన్‌నుండి విమానసహాయం అందలేదు వీరి వద్దనున్న ఆహార పదార్థాలు తరిగి పోయాయి ఆ సమయంలో ఆ ప్రాంతంలో దొరికే ఒక రకమైన గడ్డిని వండుకుని సైనికులు తినేవారు. వారితోపాటు ఆ నాయకుడు కూడా ఆ ఆహారమేతీసుకొనే వాడుట

భోగభాగ్యాలనుభవించడమే నాయకుని పని కాదు. అంతా ఒకటే అనే భావంతో మెలగగలిగినవాడే మహానాయకుడు ఈ విషయాన్ని ఆచరణ ద్వారా నిరూపించిన ఆ నాయకుడైన మహా వ్యక్తి నేతాజీ సుభాష్ చంద్రబోస్. భారత స్వాతంత్ర్య సంగ్రామాన్ని నడిపినసాహసము, త్యాగము, దేశ భక్తి ప్రదర్శించిన ప్రముఖులలో ఒకడు. అజాద్ హింద్‌ఫౌజ్ అని పిలువబడే ఈ సేనకు స్థాపకుడు నేతాజీ



–ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

# విదేశాలలో శ్రీ సత్యసాయి సేవాసంస్థల ప్రగతి

సేకరణ : ఎన్. బి. ఎస్. రామారావు

## చైనాలో మానవతావిలువల సదస్సు :

జపాను దేశములోని సత్యసాయి సేవాసంస్థ మరియు చైనాలోని 'సాంగ్ చింగ్ లింగ్ ఫౌండేషన్ ఆఫ్ చైనా' అను సంస్థయు కలసి, విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, బాలవికాస్ గురువుల (స్త్రీల)కు చైనాలో అగస్టు 1994 : 16 వ తారీకున "మానవతా విలువలపై వ్యాసరచన పోటీ సదస్సు"ను ప్రకటించినవి ఇందు చైనాలోని 30 రాష్ట్రములనుండి మొత్తం 43,618 సభ్యులు పాల్గొనిరి. ఇందు అత్యుత్తమ శ్రేణిలోని మొదటి 9 మందికి జపాను దేశములో జరిగిన 'All Japan Convention' లో 1994 సెప్టెంబరు 25 వ బహుమతి ప్రదానము గావింపబడినది

ఈ మానవతా విలువల సదస్సు ప్రపంచ జనాభాలో వీలైనంత ఎక్కువమందికి అందించవలెనని చైనాలోని సత్యసాయి సేవాసమితి ఆలోచన చేసినది. సాంగ్ చింగ్ లింగ్ ఫౌండేషను అను సంస్థ 'మేడమ్ సాంగ్' అను ఆమె కృషి గుర్తింపునకై ఏర్పరచబడినది. ఈమె తన దేశాభివృద్ధికి (మదర్ థెరాస్సావలె) ఎంతో నిస్వార్థ సేవచేసినది. ఈమె తన జీవితమును విద్య, విద్యార్థుల శ్రేయస్సునకై ధారపోసినది అగస్టులో ప్రకటించిన ఈ వ్యాస రచన పోటీ చైనాలో 'బీజింగ్' అను పట్టణములో నిర్వహించబడెను ఈ పోటీలో పాల్గొనిన 44 వేలమందిలోనూ ఎక్కువ మార్కులు పొందిన మొదటి 100 మంది సభ్యులను సత్యసాయి సేవాసంస్థ ఖర్చులు భరించి, వారివారి స్థానముల నుండి వారినందరినీ బహుమతులు గైకొనుటకు 'బీజింగ్' పట్టణమునకు తీసికొనివచ్చినది. చైనాలోని 'Great Hall' లో మొదటి 9 బహుమతి గ్రహీతలకు, అనేక పాశ్చాత్య దేశీయుల ప్రముఖుల సమక్షమున జపాన్ దేశపు సత్యసాయి సంస్థల ప్రెసిడెంటు శ్రీ రుకోహీరాగారు బహుమతుల నొసగిరి. మానవతా విలువలపై ఈ 9గురు వ్రాసిన చక్కని ఇంగ్లీషు వ్యాసములను త్వరలో ముద్రించుటకు జపాన్ సత్యసాయి సంస్థ కృషి సలుపుచున్నది. వీరు వ్రాసిన (మానవతా విలువలపై) వ్యాసములు చైనా ప్రజలందరినీ అత్యుత్తమ ఆదర్శములతోనూ - సత్యసాయిబాబావారి అనుగ్రహముతోనూ ప్రభావము గావించుచున్నవి.

## టోక్యో సాయి సెంటరులో స్వామి

1994 కృష్ణాష్టమినాడు జపానులోని టోక్యో సాయి సెంటరులో స్వామి కుర్చీపై అప్పుడే ఇస్త్రీ చేసి తెచ్చి వేసిన మడత మాయని తెల్లని జేబు రుమాలు - సూక్ష్మరూపములో ఆ కుర్చీని అలంకరించిన శ్రీ సత్య సాయి బాబావారిచే ఉపయోగింపబడి - కుర్చీ చేతులపై అటునుండి ఇటు, ఇటు నుండి అటు మార్చబడి, నలిగి పోవుట సాయి సభ్యులందరిచే గమనింపబడినది.

## 7 వ అఖిల భారత బాలవికాస్ గురువుల సమ్మేళనము

బెంగుళూరులో జూలై 1994 (19 నుండి 2 వ తేదీ వరకు) జరిగిన 25 వ శ్రీ సత్యసాయి బాలవికాస్ యూనివర్సిటీ మరియూ 7 వ అఖిలభారత బాలవికాస్ గురువుల సమ్మేళనము - శ్రీ సత్యసాయి బాబావారి దివ్య సన్నిధిలో దిగ్విజయముగ జరిగినది ఈ సదస్సులో ఢిల్లీకి చెందిన "సిస్టర్ విమ్మి కన్వార్" అను నామెచే బాలవికాస్ విద్యా బోధనల పద్ధతిపై వీడియో టేపు ప్రదర్శింపబడినది "Blossoming of Human Excellence" అను పేర ఒక ప్రత్యేక 'సావనీరు' ప్రకటింపబడినది. ఈ సావనీరులో 1969 నుండి 1994 వరకూ బాలవికాస్ ప్రగతి, షిర్డి సాయి;

సత్యసాయి, ప్రేమసాయి అను మూడుఅవతారములలో సాయి సుమారు 200 సం॥ల పాటు మానవాళి నుద్ధరించుట – 90 సం॥ తరువాత 'నూతన సాయి శకారంభము – 25 సం॥ బాలవికాస్ ప్రగతి – అను అంశములు వివరింప బడినవి.

## జపానులో శ్రీ సత్యసాయి బాబావారి దూరదర్శన్ కార్యక్రమము

జపాను దేశములో 47 రాష్ట్రములలో జూలై 13, 1994 న Ntv Tv ప్రోగ్రాము – ప్రభుత్వపు అధికారుల అంగీకారముతో – దేశమంతటా భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారిపై 'సెట్' మరియు 'ఓషీరో' అను జపాను సాయి సభ్యులు తీసిన చలనచిత్రము ప్రసారము గావించబడినది జపాను దేశములోని జనాభాలో సుమారు 20% జనులు సాయిబాబావారిని T.V లో తిలకించి, పులకరించి పరవశించిరి.

**కొరియా** లో జూలై 9 వ తారీఖు 1994 న S B S.–T.V. సాయిబాబావారిపై గంటసేపు T V.లో ప్రదర్శన ప్రసరించింది సౌత్‌కొరియాలోని చాలామంది జనాభా ఈ సినిమా తిలకించి 'సాయి'ని తెలుసుకొనుటలో ప్రభావితులైరి.

**హాంగ్‌కాంగ్** లో సాయి సభ్యులందరూ అక్టోబరు – 1974 1, 2 తారీఖులలో జాన్‌హిస్లాప్‌గారిచ్చిన ప్రసంగములు, స్వామితో వారికి కల్గిన అనుభవములను స్టడీ సర్కిలులో విని ఆనందించిరి.

## జపానులో E. H. V. వ్యాసరచనపోటీలు

చైనా దేశము నిర్వహించిన 'మానవతా విలువలలో' వ్యాసరచన పోటీని చూసి ఇపుడు జపాను సత్యసాయి సంస్థలు జపాను విద్యార్థులకు 'మానవతా విలువలతో కూడిన విద్య' అన్న అంశముపై వ్యాసరచన పోటీ జరుపుటకు నిర్ణయించి ఇందు గెలిచిన మొదటి 9 మంది విద్యార్థులను అమెరికా వారము రోజులు 'విద్యావిహార యాత్రకు ఉచితముగా పంపుచు, ఖర్చులు భరించుటేప్పు నొనగుట బహుమతిగా నిర్ణయించినది.



అంతుబట్టని అద్భుతాలు – 21

## తుప్పుపట్టని ఇనుప స్తంభం

—భండారు పర్వతాలరావు

ఢిల్లీ పట్టణంలో మెహరాలీ ప్రాంతంలో ఒక చోట ఒక ఇనుపస్తంభం వుంది. దీని ఎత్తు 23 అడుగులకు పైమాటే దీని వ్యాసం గజమున్నర. పైభాగంలో ఏవో డిజైన్లు మలచబడివున్నాయి. ఈ మొత్తం దూలంలాగా సాగకొట్టి తయారు చేసినది కావటం వలన దీనిని తయారు చేసిన వారి పనితనం అమోఘమనక తప్పదు ప్రస్తుతం మనకు అందుబాటులో వున్న సాంకేతిక పరిజ్ఞానాన్ని వుపయోగించి కూడా, యిటువంటి స్తంభాన్ని తయారు చేయటం కష్టమే

ఈ స్తంభంలోని విశేషం ఏమిటంటే కొన్ని వందల ఏండ్లుగా వానకు తడిసి, ఎండకు ఎండుతున్నా, ఇది ఏమాత్రం తుప్పు పట్టకపోవటం. నిజానికి యిది ప్రస్తుతం మన వాడకంలో వున్న స్టైయిన్‌లెస్‌స్టీలు కాదు. ఇందులోని లోహాన్ని పరీక్ష చేయగా అనేక కలుషిత పదార్థాలున్నట్లు తేలింది కనుక తుప్పు పట్టేందుకు అవకాశాలు తక్కువ మరి తుప్పుపట్టకుండా యిది ఎలా వుందో, అలా ఎలా తయారు చేశారో యింతవరకు కనుగొనలేదు.

సామాన్యంగా అందరూ ఈ స్తంభాన్ని అశోక స్తంభం ( అశోకుడు నాటించినదని ) అని భావిస్తారు. కాని యిది రాజాచంద్ర అనే చక్రవర్తి స్మారకచిహ్నంగా ప్రతిష్ఠింపబడిందని ఇది క్రీ శ. 5వ శతాబ్దానికి చెందినదని ఊహిస్తున్నారు. భారతీయుల లోహకార నైపుణ్యానికి ఇది అద్దం పడుతుంది.

ఇన్ని వందల ఏండ్లుగా యీ స్తంభం తుప్పుపట్టకుండా దెబ్బతినకుండా ఎలా నిలిచి వుండగలిగిందన్నది ఎవరికీ అంతుబట్టటంలేదు. ఇలాంటిది యిది వొక్కటే !



యువతా వాణి : 8

# విలాసాలవుతున్న వైపరీత్యాలు

ఆర్. యస్. కె. మూర్తి

భారత క్రికెట్ టీములో వెంకటపతిరాజనే మంచి బౌలరు ఒకరున్నారు. అతను ఎంతటి నిపుణుడైన ఆటగాడో అంతటి బలహీనుడుగా కన్పిస్తారు. సాటి ఆటగాళ్ళమధ్య శ్రీ రాజును మాంసాహారం తీసుకోమని ప్రోద్బలం చేశారని వార్తా కథనాలు విన్పించాయి- పత్రికలలో.

కొంతకాలం క్రిందట కూడా ఇట్లాంటిదే వార్త వచ్చింది. శాకాహారులైన భారతీయ క్రికేటర్లు మంచి పటిష్టమైన టీము కాలేరని ఒక వెస్టిండీసు క్రికేటర్లు వ్యాఖ్యానించారుట ఇది నిజమా ?

భగవానుని సృష్టిలోనే మాంసాహారులూ, శాకాహారులూ అన్న విభజన ఉంది మనుషులలోనే కాదు; జంతువులలో కూడా జంతువులన్నింటిలోకి భారీదైన ఏనుగు శాకాహారి. డార్విను ప్రకారం మానవుని పూర్వరూపమైన మర్కటం శాకాహారి మరైతే ఏనుగు బాగా పిరికి జంతువు. అది మాంసాహారిగా మారితే, ధైర్య సాహసాలు పుంజుకొని .... తన శారీరక శక్తికి దీటైన ధీశాలిగా రూపొంది మృగరాజు కావచ్చునని .... మనం వాదించవచ్చునా ? ' సింహస్వప్నం ' అన్న నానుడి మారిపోతోందని అనవచ్చునా ?

కాని నేడు రేపు మనుషుల మధ్య-అదీ మన దేశంలో ఎక్కువగా- మాంసాహారం గొప్పదంటూ ఒక తమాషా ప్రచారం జరుగుతున్నది - ఎందుకో తెలియదు పరిమితమైన మోతాదులలో మద్యం సేవించటం ఆరోగ్యానికి మంచిదన్న ప్రచారం లాగా.

మద్య మాంసాదులు పరిహార్యములనేది మన విశ్వాసం మనలోనే మాంసాహారులున్నా. అసలు ప్రపంచ జనాభాలోనే మూడు వంతులమంది మాంసాహారులే కదా ! అయినప్పటికీ శాకాహారమే మానవాళికి శ్రేయోదాయకమన్న భావన - మన దేశంలోనే కాదు: ప్రపంచ వ్యాప్తంగా ప్రచారంలో ఉన్నట్టిదే నూటికి నూరుపాళ్లు మాంసాహారులుండే పాశ్చాత్య దేశాలలో కూడా శాకాహారం యొక్క పరమ ప్రయోజనాలను గురించి, మంచి మాటలు విన్పించేవారు విన్పిస్తూనే ఉన్నారు. జీవకారుణ్య సంఘాలవారు జంతు హింస పనికి రాదని ప్రబోధాలు గావిస్తూనే ఉన్నారు జగదీశ్ చంద్రబోసు కూరగాయలకు కూడా ప్రాణమున్నదని ఋజువు చేశారు కదా! వాటిని తినటంకూడా జీవహింసే- అనటం వితండవాదమవుతుంది

అట్లా అని మానవాళి అంతా ఒక్కసారిగా శాకాహారులుగా మారిపోవాలని కాదు, మారలేదు కూడను మారితే ప్రకృతిలో 'సమతుల్యం' - అదేమవుతుందో, అదొక సమస్య- కాకపోతే మాసాహారం విశిష్టమైనదనీ .... అందరూ మాంసాహారులుగా మారాలని జరుగుతున్న ప్రచారమటుకు అభ్యంతరకరమైనట్టిది మాంసాహారం క్రొత్తగా అలవరచుకోదగినంత మంచిదనటం - అదొక విపరీతపు భావన మాంసాహారులైన వారికి అదే మంచిది; శాకాహారులైనవారికి శాకపాకాలే మంచివి. అంతే తప్ప, అందరూ మాంసాహారులే కావటం అభిలషణీయం కాదు.

అయితే యిట్టి భావనలు మన మధ్య చాలాకాలం నుంచే జొప్పించబడుతూ ఉన్నాయి పరధర్మీయులు, విజాతీయులు మన జాతిని ఆక్రమించుకొనగలగటానికి

ఒక కారణం – వారు మాంసాహారులు కావటమేనన్న ఒక భ్రాంతి ఏనాడో మన మధ్య వ్యాప్తిలోకి తేబడింది వెస్టిండీస్ మంచి క్రికెటర్లు, పాకిస్తానీయులు మంచి హాకీ ఆటగాళ్ళు కావటానికి కారణం – వాళ్లు మాంసాహారులు కావటం అన్నట్లుగా. గాంధీజీ బాలునిగా ఉన్నపుడు మాంసం భుజించి, శక్తిని పుంజుకొని, బ్రిటీషువారిని మన్ను కరిపించాలని, ఒక రోజున మాంసం తిన్నారుట. ఇటు తర్వాత ఆయనకు కడుపులోనుంచి మేకల అరుపులు విన్పించినవట వెంకటపతిరాజుగారికి కూడ అటువంటిదే అనుభవం కలుగుతుందేమో – బాగా బలంగా బంతి విసరాలని మాంసాహారం మొదలుపెడితే!

జన్మతః శాకాహారులైన యువకులు నేడు మాంసాహారులుగా మారటం – అదొక ఫ్యాషన్ అని అనుకుంటున్నారు. అట్లా ప్రచారం జరుగుతున్నది కూడ ఇదివరకెప్పుడూ మన సినిమాలలో మాంసం భుజించడం ప్రదర్శించేవారు కాదు. ఇప్పుడట్లాంటి దృశ్యాలు లేని సినిమా ఉండటంలేదు వివాహాదులలో మాంసం వడ్డించేవారుకాదు రాజకీయాది సదస్సులలో వెజ్ అండ్ నాన్ వెజ్ ప్రక్క ప్రక్కనే ఉంచేవారు కాదు. 'ఏం ఫరవాలేదు. మాంసం వంటికి మంచిది కూడ' అన్న మిత్ర వాక్యాలు విన్పించేవి కాదు. నేడు రేపు యివన్నీ సర్వ సాధారణమైపోతున్నాయి.

మాంసాహారం సాత్వికాహారం కాదు మనుషులలో సత్వ, రజో, తమో గుణ ప్రధానులు సహజంగానే ఉంటారు అయితే అందరూ వాంఛించదగినట్టిది – సాత్విక గుణసంపద. సత్వగుణ ప్రధానమైన సమాజం సుఖ దాయకంగా ఉంటుంది మన ప్రాచీన సాహిత్య మంతా సత్వగుణ ప్రబోధాత్మకమైనట్టిదే. అట్టి సాత్వికతకు దోహదపడేది – శాకాహారం. ఇది విజ్ఞాన శాస్త్రజ్ఞులు అంగీకరించిన వాస్తవం.

కాబట్టి మారటమంటూ జరిగితే శాకాహారులు మాంసాహారులుగా కాదు: వారు వీరైనందువల్ల వ్యక్తికీ సమిష్టికీ శ్రేయోదాయకం, సుఖప్రదం ఎవరికి వారుగా అంటే మాంసాహారులు మాంసాహారులుగా శాకాహారులు అట్టివారుగానే ఉండిపోవటం – మధ్యేమార్గం. అంతే తప్ప తమోగుణజన్యమైన మాంసాహారం కొత్తగ మనిషికేదో మంచిచేస్తుందనే వాదన అంగీకారయోగ్యం కాదు.

మాంసాహారుల సంఖ్య మన మధ్య పెరుగుతూ ఉన్నందువల్ల పర్యావరణ, ఆర్థికాది రంగాలలో హెచ్చుతగ్గులు ఏర్పడుతున్నవని కూడ నేడు శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు

మాంసాహారులతోపాటు కబేళాలు పెరుగుతున్నాయి. వాటితో మన పశు సంపద క్షీణిస్తున్నది. నేటి వేగంతో కబేళాలు పెరిగితే, 21వ శతాబ్దంలో పిల్లలు 'పాలు' అన్న మాట ఎరిగిఉండరన్నంతవరకు పర్యావరణ శాస్త్రజ్ఞులు భయ సందేహాలు వ్యక్తం చేస్తున్నారు. పశు సంపద క్షీణిస్తే, మన వ్యవసాయరంగం దెబ్బతింటుం దనీ; సాంప్రదాయక వ్యవసాయ పద్ధతుల స్థానంలో యాంత్రిక పద్ధతులు వచ్చిపడి .... పరదేశాలపై మనం ఎక్కువగా ఆధారపడవలసి వస్తుందనీ .... తద్వారా మన ఆర్థిక స్వాతంత్ర్యం దెబ్బతింటుందనీ మేనకా గాంధీ వంటి పర్యావరణ నిపుణులు గోలపెడుతున్నారు.

ఇటువంటి పరిస్థితులలో స్వతహాగా శాకాహారులైన వారు అదేదో ఫ్యాషన్ అనో మంచిదనో భ్రమ, వ్యామోహాలతో మాంసాహారులుగా కష్టపడి మారటం అభిలషణీయం కాదు అట్లా మారటమంటూ జరిగితే, సహజంగా మాంసాహారులైనవారు శాకాహారం ప్రతి ప్రియులు కావటం మంచిది పాశ్చాత్య దేశాలలో నేడు జరుగుతున్నది ఇందుకు విరుద్ధమైనటువంటిది మన దేశంలో జరుగుతున్నదనీ .... అట్లా జరుగరాదనే తప్ప మన కెవరికి నైతికంగా మాంసాహారులయందు నిరసనేమీ ఉండదు కదా; మాంసాహారులను నిరసించట మంటే ప్రపంచంలో మూడు వంతుల జనాభాను నిరసించే మూర్ఖత్వమే అవుతుందిగదా ! ఏమంటారు ?



# మాట

.సోమంచి రామం

సకల జీవరాసులందు శ్రేష్ఠము మానవ ప్రాణి. క్రిమి కీటకాదులకు, పశుపక్ష్యాదులకు, వన్యమృగాదులకు లేని ముఖ్య లక్షణము మానవుని కొక్కనికే దైవ దత్తము. అదే వాక్కు లేక మాట. మాటల ద్వారానే మనిషి తన భావాలను వ్యక్తపరుస్తాడు. నోరు మంచి దైతే ఊరు మంచిది అవుతుందంటారు. ఇక్కడ నోరు అంటే మాట అని అర్థం. మంచిగ మాట్లాడే మనిషికి. ఊరివారందరి మంచి, మర్యాద, మన్నన లభిస్తాయి.

కొందరి మాట పరుషంగా ఉన్నా, మనసు మాత్రం మధురం, సరళం ! వారి మాట కరుకేగాని, మనసు మెత్తనే ! మాటలాడటం మనుషులందరికీ వచ్చినా, మందిని మెప్పించేలా మాట్లాడటం ఒక కళే ! మనం మాట్లాడే మాటల్లో మర్యాద, వినయం, స్పష్టత, సభ్యత ఉండాలి ! సందర్భానుసారంగా; సమయానుకూలంగా మాట్లాడటం నేర్చుకోవాలి అందుకు ఉదాహరణగా, కిష్కింధకాండలో రామలక్ష్మణులతో హనుమంతుడు మాట్లాడిన విధమును పేర్కొనవచ్చును హనుమంతుని ప్రసంగము, ఆకర్షణీయంగా యుండి, అపశబ్ద,వ్యాకరణ దోషరహితములుగాయున్నవని రాముడు ప్రశంసిస్తాడు

కొందరు కేవలము మాటలు చెప్పి కార్యమును సాధించుకొంటారు. మరికొంతమందికైతే, మాటలు కోటలు దాటుతాయి గాని, కాలు గడప దాటదు. 'మనిషి మనిషికొక్కమాట చెప్పెడివాని మనసులోన యెంత మంచియున్న మనసు నీయబోకు మాయ చేసేనురా, నమ్మ వాస్తవమ్మ నాదు మాట-అని కవి చెప్పినట్లుగ, మాయ మాటలు చెప్పి జనులను మోసపుచ్చుట మంచి లక్షణం కాదు.

మనిషికొకమాట గొడ్డుకొకదెబ్బ అంటారు. మాట పడలేని మనిషి అభిమానధనుడు. కొందరి మాటలు ఈటెల్లా మనిషి హృదయాన్ని గాయపరుస్తాయి. కాలు జారితే తీసికోగలం గాని, నోరు జారితే తీసికోవడం కష్టము.

" బాధపెట్టు మాటలాడు మనిషికన్న,
పలుకలేని యట్టి పశువే మిన్న
మాట దుడుకుకన్న మౌనమేమిన్న,
నమ్ము వాస్తవమ్ము నాదు మాట "

అన్నట్లు మనిషిని బాధించు మాటలకన్న మౌనమే మిన్న ! మనిషి మర్యాద, మాటల్లోనే వ్యక్తమవుతుంది.

మాట నివ్వడం అంటే వాగ్దానం చేయడం ! మాట నిచ్చాక దాన్ని నిలబెట్టుకోవటం ధర్మం ! అడిన మాట నిలబెట్టుకోవడం అంత సులభం కాదు మానవుని నచ్చీలతకదే సాక్ష్యాధారం ! పలు విధముల దురవస్థల పాలైనప్పటికి, ఆడిన మాట నిలబెట్టుకొని ఆచంద్ర తారార్క యశస్సును ఆర్జించిన వారెందరో ఉన్నారు. అందుకే " మాట నిచ్చి తప్పబోకు ' అన్నారు పెద్దలు. 'మాటకు ప్రాణము సత్యము' అంటాడు ప్రజాకవి వేమన ! మనిషి ఎప్పుడూ సత్యమునే మాట్లాడాలి మాట ఒకటే అయినా ఉచ్చారణ బట్టి అర్థం చేసికొనే భావం మారిపోతుంది.

'అశ్వత్థామ హతః' అని బిగ్గరగ పలికి 'కుంజరః' అని నెమ్మదిగ పల్కిన ధర్మరాజుకు అసత్యదోషం అంటినట్లే

మంచిగ మాట్లాడటం ఎంత ముఖ్యమో, యితరుల చెప్పే మాటలను ఆలకించడం కూడ అంతే అవసరం! కాని,

" వినదగు నెవ్వరు చెప్పిన,
విన్నంతనె వేగపడక వివరింపదగున్
గనికల్ల నిజముదెలిసిన
మనుజుడె పో నీతిపరుడు మహిలో సుమతీ "

అన్న సుమతీకారుని నీతి మనకు సుపరిచితమే.

పెద్దల మాట చద్దిమూట అన్నారు వారి మాటలన్నీ జీవితానుభవజనితాలే! అందుకనే సత్పురుషుల మహర్షుల మాటలను పెడచెవిని పెట్టరాదు. దుర్మార్గుల, దుష్ట బుద్ధుల మాటలకు చెవినొగ్గరాదు. విదురుని సద్బోధలు వినక, కురుక్షేత్ర యుద్ధానికి కౌరవ వంశక్షయానికి కారకుడైన ధృతరాష్ట్రుడు, మంథర దుర్బోధలు విని రాముని అరణ్యవాసానికి, దశరథుని మరణానికి కారణ మైన కైక మనకు ప్రత్యక్ష సాక్షులు అందుకే దైవ దత్తమైన 'మాట' ను వినియోగించడంలోను, వినడం లోను, నిలబెట్టుకొనడంలోను మనిషి జాగ్రత్త వహించాలి.

---

## మంచి మనసు

శ్రీ సత్య సాయియే శ్రీరామచంద్రుండు
చింతించి చూడవే చిలిపి మనస ।
శ్రీ సత్యసాయియే శ్రీకృష్ణపరమాత్మ
మూర్ఖంబు వంచవే మొండిమనస ।
శ్రీ సత్యసాయియే శ్రీ ఆంజనేయుండు
ప్రణతులర్పింపవే రాతి మనస ।
సత్యసాయియే శ్రీ ఏసునాథుండు
కూర్మి కొల్వగరావె కొంటెమనస ।
సిగ్గు - బిడియమేల । చీమే దేహంబులో
క్రుగ్గి చచ్చుటండె మనసదేల ।
స్వాతిశయము వీడి - సాయిని పూజించు
మనసు లేని మనసు - మనసె మనస ।

- ఏకా రామచంద్రరావు

## చదువుల రాణీ

వాణీ ।
కీరవాణి
వివేకాన్ని విస్మృత పరచే విద్యారాణి
వికాసం చేకూర్చే వీణావాణి
విజ్ఞానమందించే విశ్వరాణి
సృష్టిలో ఎన్నటికీ తరగని గని
నిరంతరం ప్రవహించే విజ్ఞాన ఖని
సర్వ సంపదల శిఖరాగ్రణి
సప్త వ్యసనాల సంహారిణి
నీ సాంగత్యం ఆపాత మధురం
నీ పద లాలిత్యం ఆలోచనామృతం
చదువులరాణీ । నీకిదే నమోవాకము

- మానస

---

# వాస్తు విజ్ఞానం

-జానమద్ది హనుమచ్ఛాస్త్రి

వాస్తుశాస్త్ర పరిజ్ఞానం ప్రతి వ్యక్తికీ అవసరం. మనం ఈనాడు పర్యావరణ పరిరక్షణ వివిధ కాలుష్యాల నివారణను గురించి ఎలా ఆలోచిస్తున్నామో, అలాగే మన ప్రాచీనులు మనకంటే మిన్నగ ఈ విషయాన్ని గురించి ఆలోచించేవారని తెలుస్తున్నది. వైదికయుగం నాటి ఒక కథ ఇలా వుంది.

రుద్రప్రజాపతి - ఉషాల వివాహం జరిగింది. ఆ దంపతుల నాలుగవ సంతానమే వాస్తోష్పతి. అతడే గృహపతి అగ్ని సాయణాచార్యులు అతనినే యజ్ఞ వాస్తుస్వామి అన్నారు అతడే యజ్ఞవేదికకు అధినాయకుడు అన్ని వాస్తు విషయాలకు, భవన నిర్మాణానికి అతడే ముఖ్యం పృథ్వి అతని గృహిణి

వాస్తు శబ్దం 'వసు' ధాతుజన్యం వసించుట, మిగిలియుండుట అని అర్థం (వసంతి అత్ర ప్రాణినో అత్ర వాస్తు) వేదకాలంలో దీనిని " వేష్మ " చుట్టుకొన్నది అన్న అర్థంలో ప్రయోగించేవారు. నివాసస్థానమును నిర్మించుకొనుటయే వాస్తు విద్య ఇది శిల్పశాస్త్రమందలి ఒక భాగం 'శుక్రనీతి శాస్త్రం' ప్రకారం ఇళ్ళు మాత్రమే కాదు, దేవాలయాలు, దేవ ప్రతిమలు, ఉద్యానవనాలు, కాలువలు ప్రాసాదాలు,నాట్యమందిరాలు, సభామందిరాలు, అంగళ్ళు, వ్యాపారస్థలాలు, నగర నిర్మాణాలు, కోటలు, కందకాలు, స్తూపాలు, విజయ స్తంభాలు .... ఇలా పలు విధాల నిర్మాణాలకు ఆధారం వాస్తుశాస్త్రం భారతీయ వాస్తు శాస్త్ర ప్రకారం నిర్మింపబడిన భగ్నావశేషాలను చూచినపుడు మనం ఆశ్చర్య చకితులమౌతాము. అత్యద్భుతములైన ఆ నిర్మాణాలను చూచి మైమరచిపోతాము

మానవుడు . చతుర్విధ పురుషార్థముల సిద్ధికోసం, వాస్తు నిర్మాణం సాగిస్తాడు - ధర్మ, అర్థ, కామ, మోక్షాల సాధనకోసం, గృహిణితో కూడిన గృహస్థాశ్రమం కోసం - నివాసం ఏర్పరచుకొంటాడు.

భూమాత శరీరంపై వాస్తువును నిర్మించడమంటే తల్లికి బాధ కల్గించటం అందుకే వాస్తుపురుష ప్రార్థన,

'సశైల సాగరాం పృథ్వీం యథావసస మూర్థని
తథామాం వహకల్యాణ సంపత్ సంతభిః సహ '

(హే ! వాస్తుపురుషా, నీ శిరముపై ఏ విధంగా పర్వతాలు సాగరాలు నివసిస్తున్నాయో ఆ విధంగా మమ్ములను శుభ, సంపద, సంతతితో, నీ శిరముపై ధరించు)

వైదిక యుగంలో వాస్తు విజ్ఞానమును ధార్మిక కార్యంగా భావించేవారు త్వష్టా, ఋభూ, మాన (అగస్త్య) వశిష్ఠులు, ఋగ్వేదకాలంనాటి వాస్తు శాస్త్ర కోవిదులు. 'హర్మ్యములు' ఆనాటి ప్రాసాదాలు వాటిని ఇంద్రుడు ధ్వంసం చేసినట్లు వేదాల్లో చెప్పబడింది. ఆనాటికే సహస్రద్వార సహస్రస్తంభ మందిరములుండినట్లు తెలుస్తున్నది.

వేదకాలంలో శవాలను పూడ్చేవారు వేదాల్లో 'స్తూప' శబ్దం వుంది. తర్వాత కాలంలో బౌద్ధులు దానిని స్వీకరించారు అథర్వణ వేదంలో వాస్తుశాస్త్ర పారిభాషిక పదములున్నాయి ఉయ్యాల నుండి శ్మశానం, మానవునికి కావలసిన వాస్తు రచనకు సంబంధించిన వివరణలున్నాయి 'గృహ్యసూత్రం' లో వాస్తుశాస్త్ర వివరణలున్నాయి. ఈనాడు మనం మట్టిని పరిక్షించే విధంగా, ఆనాడు కూడా మట్టిని పరీక్షించేవారు. జల పరీక్ష ఒక శాస్త్రంగా వుండేది.

రామాయణ కాలంనాటికి వాస్తుశాస్త్రం బాగా పరిణతి చెంది యుండినది. రామాయణములలో నగర, ప్రాసాద ఉద్యాన, కోటలు నిర్మాణరీతులు చెప్పబడినాయి.

విశ్వకర్మ నాటి ప్రముఖ శిల్పశాస్త్రవేత్త. అతడు దేవతల ఇంజనీర్ మయుడు రాక్షసుల ఇంజనీర్ రామాయణములో ఏడు, ఎనిమిది అంతస్తుల భవన నిర్మాణములు చెప్పబడినాయి. మహాభారతములో ఎన్నో ఉదాహరణములున్నాయి. మయసభ నిర్మాణ వైశిష్ట్యం అందరికీ తెలిసిందే. నగర రక్షణకు సంబంధించిన పలువిషయాలు మహాభారతములో కానవస్తాయి బౌద్ధ జాతక కథలలో వాస్తు వివరాలున్నాయి ఒక కథలో భూగర్భ గృహ నిర్మాణ విశేషాలున్నాయి రాయి, మట్టి, చెట్టు, మున్నగు వాటి ఉపయోగాలు వారు క్షుణ్ణంగా తెలుసుకొన్నారు. బౌద్ధ విహారాల వర్ణన విపులంగా వుంది. (మహావగ్గ చుల్లవగ్గ) చాణక్యుని అర్థశాస్త్రములో మహామంటపాలు, వంతెనలు, ప్రాసాదాలు, విహార కేంద్రాలు సరోవరాలు, నగర నిర్మాణాలు, గోపురాలు, దేవాలయాలు, చైత్యాలు, స్తూపాలు నేటి వర్ణన వున్నది.

చాణక్యుని కాలంనాటికే వాస్తు శాస్త్రమునకు సంబంధించిన గ్రంథాలెన్నో వుండేవి భృగు, అత్రి, వశిష్ఠ విశ్వకర్మ, నారద, మయ, నగ్నజిత, విశాలాక్ష, పురందర, కుమార, బ్రహ్మ, నందీశ శౌనక, గర్గ, వాసుదేవ, అనిరుద్ధ, శుక్ర, బృహస్పతి– అను పదునెనిమిది వాస్తు శాస్త్రజ్ఞుల పేర్లు కనిపిస్తాయి.

వాస్తుశాస్త్ర గ్రంథాలు కొన్ని : విశ్వకర్మీయశిల్ప, మయమత మానసార, కాశ్యపశిల్ప, అగస్త్య సకలాధికార, సనత్కుమార వాస్తుశాస్త్ర, శిల్పసంగ్రహ, శిల్పరత్న, చిత్రలక్షణ, శైవాగమ, వైష్ణవ పంచరాత్ర, అత్రిసంహితా, వైఖానసాగమ, తంత్ర, తంత్రి సముచ్ఛయ, ఈశాన శివగురుదేవ పద్ధతి, విశ్వకర్మ ప్రకాశ, సమరాంగణ సూత్రధార, సూత్రధారమండన, వాస్తురత్నావళి, వాస్తుప్రదీప, మత్స్యపురాణ, అగ్నిపురాణ, భవిష్యపురాణ, బృహత్సంహితా, హయశీర్ష పంచరాత్రి, విష్ణుధర్మోత్తర, ప్రతిష్ఠాగ్రంథ, హరిభక్తవిలాస, కామికాగమ, కర్ణాగమ మొదలగునవి. వీటి విజ్ఞాన భాండారం మనకు అవసరం కదా ?

ముస్లిమ్ రాజుల పాలన ప్రారంభంతో మన వాస్తు నిర్మాణ విధానాలలో నూతన అధ్యాయం ప్రారంభమైంది బ్రహ్మాండమైన ఇమారత్‌లు, గుంబజ్‌లు, అతి సూక్ష్మమైన నగిషీపనులు, మరోకొత్త లోకాన్నే నిర్మించాయి ఆగ్రాలోని తాజ్‌మహల్, బిజాపూర్‌లోని గోల్‌గుంబజ్ ఈ శిల్పశైలికి నిదర్శనాలు. ప్రపంచ దేశాల దృష్టిని ఆకర్షించిన నిర్మాణాలివి. బ్రిటిషు పాలనాకాలంలో ఎన్నో అందమైన భవనాల నిర్మాణం జరిగింది.

దక్షిణ భారతమందలి ఆలయాలు హంపి, హళేబీడులోని శిల్పనిక్షేపాలు భారతీయ వాస్తువిజ్ఞానానికి నిదర్శనాలుగా వున్నాయి.

కాలగతిలో పలు మార్పులు వచ్చాయి మన ప్రాచీన వాస్తు విజ్ఞానాన్ని విస్మరించి కాంక్రీట్ అరణ్యాల నిర్మాణానికి పూనుకొని, భారతీయతను కోల్పోతున్నాము. ఆధునికత పేర, మనం గాలి, వెలుతురు చొరవడని కార్యాలయ భవనాలను నిర్మిస్తున్నాము.

ఇటీవల బెంగుళూరులో జరిగిన అఖిల భారత వాస్తు సమ్మేళనంలో, వాస్తు విజ్ఞాన మహత్తును గురించి ఎందరో విద్వాంసులు, ఇంజనీర్లు కూలంకషంగా చర్చించుట ప్రశంసనీయం బెంగుళూరులోని విఖ్యాత జ్యోతిష పండితులు డా॥ బి.వి. రామన్ మరియు రాజేశ్వరిగార్ల ఆధ్వర్యంలో జరిగిన ఈ సమ్మేళనాన్ని, భారత ఎన్నికల ప్రధాన కమీషనర్ శ్రీ టి.ఎన్. శేషన్ ప్రారంభించారు.

మన ఇంజనీరింగ్ కళాశాలల్లో మన దేశ వాస్తుశాస్త్ర అధ్యయనం ప్రారంభం కావాలి. తిరుపతి వంటి మహా క్షేత్రంలో ప్రాచీన భారతీయ శాస్త్రాల అధ్యయన కేంద్రం ప్రారంభం కావాలి.

ఇటీవల 'మీ ఇల్లు వాస్తుశాస్త్రం ప్రకారం నిర్మింపబడలేదు అందువల్లనే మీకు ఈ కష్టాలు' అనే వారి సంఖ్య పెరిగింది. ఇల్లు కట్టేముందే అన్ని విషయాలు బాగా ఆలోచించి కట్టుకోవటం అవసరం.

( 'తరంగ' కన్నడ వారపత్రిక– జూన్ 25 – సౌజన్యంతో )

# రాయలసీమ చైతన్యమూర్తి కల్లూరు సుబ్బారావు

- కంచి వాసుదేవరావు

ఈ శతాబ్దంలో మొదటి దశకాలలో రాయలసీమలో రాజకీయ సామాజిక చైతన్యాన్ని కలిగించిన వారిలో రాయలసీమ కేసరి అనదగ్గ కల్లూరి సుబ్బారావు గారు ప్రథమగణ్యులు. స్వాతంత్ర్య సమర పోరాటంలో జైలు జీవితాన్ని అనుభవించిన రాయలసీమ నాయకులలో సుబ్బారావుగారు రెండవవారు. మొదటివారుగా కచర్లహరి సర్వోత్తమరావుగారు.

1921 లో స్వాతంత్రోద్యమంలో పాల్గొంటున్న ఇరవయి అయిదు సంవత్సరాల యువకుడు సుబ్బారావు గారిని పోలీసులు హిందుపూరులో అరెస్ట్‌చేసి కేసుపెట్టారు పెనుగొండ మేజిస్ట్రేటు కేసును విచారించారు తీర్పు చెప్పవలసి వచ్చిన రోజున కోర్టులో గుమిగూడిన జన సమూహాన్ని చూచి సుబ్బారావుగారికి శిక్ష విధిస్తూ తీర్పు చెప్పడానికి మేజిస్ట్రేటు జంకారు. ఆ తర్వాత హిందుపురంలో తీర్పు ఇస్తూ ఒక నెల శిక్ష విధించారు. తీర్పు వినడానికి వచ్చిన జనాన్ని అదుపుచేయడానికి పోలీసులు చాలా కష్టపడవలసివచ్చిందట.

అంతకన్న ఆశ్చర్యం కలిగించే మరో సంఘటన జరిగింది సుబ్బారావుగారి చేతులకు బేడీలువేసి పోలీసులు రైలులో జైలుకు తీసుకువెళ్ళారు. హిందుపూర్ రైలు స్టేషన్‌కి పోలీసులు చేరుకున్నారు. సుబ్బారావుగారి తల్లి వచ్చి దీవిస్తే కాని సుబ్బారావుగారిని తీసుకువెళ్ళడానికి వీలు లేదని అక్కడ గుమిగూడిన జనం పట్టుపట్టారు. రైలు కదలకుండా పట్టాలమీద బైఠాయించారు. పోలీసులు ప్రజల వత్తిడికి తలవొగ్గారు. తల్లి పుట్టమ్మ వచ్చేవరకు ఆగారు. మూడు గంటల తర్వాత ఆమె వచ్చి తనయుని దీవించి జైలుకు సాగనంపారు. అంత చిన్న వయస్సులోనే హిందూపురంలో ఆయనకు గల పలుకుబడికి ప్రజాదరణకు ఇంతకన్న నిదర్శనం ఏముంది ? నిజానికి నీలం సంజీవరెడ్డి, రాజశేఖరరెడ్డి తరిమెల నాగిరెడ్డి వంటివారు - తొలి రోజులలో సుబ్బారావుగారి శుశ్రూష చేసినవారే.

## అనీబిసెంటు ప్రభావం

సుబ్బారావుగారు మొదట- అనీబిసెంటు, అరండేల్ బోధలకు ప్రభావితులయ్యారు హోంరూల్ ఉద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. తర్వాత మహాత్మాగాంధి ప్రభావానికి లోనయ్యారు. మనసా వాచా కర్మణా ఆయన గాంధేయవాది అయ్యారు

సుబ్బారావుగారు సహాయ నిరాకరణ సందర్భంగా 1921 లో ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా 1930 లో తిరిగి 1932 లో- ఆ తర్వాత 1940-41 వ్యక్తి సత్యాగ్రహంలో, ఆ తర్వాత క్విట్ ఇండియా ఆందోళనలో జైలుశిక్షలు అనుభవించారు. మొత్తం ఏడు సంవత్సరాలు జైలులో గడిపారు.

జైల్లో ఆయన అందరితోనూ తలలో నాలుకలా వుండేవారు. ఆయన జైలు సహచరులలో ప్రకాశం, గిరి, విశ్వనాథం, సంజీవరెడ్డి, కామరాజనాడర్ వుండేవారు. వంటలలో నలభీములను మరపించే సుబ్బారావుగారు తన పాకశాస్త్ర ప్రావీణ్యంతో తన సహచరులను అలరించేవారు.

సుబ్బారావుగారు భావస్ఫోరకంగా పద్యాన్ని పఠించడంలో ప్రవీణులు. జైల్లో తిక్కన భారతంలోని

యుద్ధపంచకంలోని వీరస్ఫోరక పద్యాలను చదవడమే కాక చక్కగా అర్థాన్ని వివరించేవారు.

సుబ్బారావుగారికి ప్రజలలోగల పలుకుబడికి నిదర్శనం- 1937 మద్రాస్ శాసనసభకు ఎన్నికలు వచ్చాయి. కాంగ్రెస్ అభ్యర్థి సుబ్బారావుగారు, జస్టిస్‌పార్టీ తరపున ధనానికి, పలుకుబడికి ఎంత మాత్రం లోటులేని ఒక సంపన్నుడు ఆయనకు బ్రిటిష్ ప్రభుత్వ అండదండ లున్నాయి, ఆయన డబ్బును మంచినీళ్ళలా వెదజల్లారు. సుబ్బారావుగారు నిరాడంబరుడు- సొంతంగా ప్రయాణ ఖర్చులు కూడా సమకూర్చుకోలేనివారు. ఐనా 40 వేల మెజార్టీతో గెలిచారు మరో విశేషం ఏమంటే జస్టిస్ పార్టీ అభ్యర్థి, సుబ్బారావుగారిపై వ్యక్తిగతమైన విమర్శను కాని, ఆరోపణను కాని చేయలేకపోయారు 1946, 52 లలో మద్రాస్ విధాన సభకు, 1946 లో రాజ్యాంగ పరిషత్తుకు, 1955 లో ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్తుకు ఎన్నికయ్యారు. తన విధులను ఆదర్శప్రాయంగా నిర్వహించేవారు.

ఆనాడు సుబ్బారావుగారికి ఒక రాయలసీమ నాయకుడుగా కాక- ప్రకాశం, పట్టాభి, కొండా వెంకటప్పయ్య రంగాల స్థాయిలో ఆంధ్ర నాయకునిగా ఆదర గౌరవాలు పొందారు. రాజాజీకి సుబ్బారావుగారంటే ప్రత్యేక గౌరవం, అభిమానం.

## స్థితప్రజ్ఞుడూ- త్యాగశీలి

ఆయన కర్మయోగి స్థితప్రజ్ఞుడు, త్యాగశీలి. ఈ విషయంలో సుబ్బారావుగారితో పోల్చదగినవారు ఆంధ్రకేసరి ప్రకాశం, మహర్షి బులుసు సాంబమూర్తి మాత్రమే. పిత్రార్జితమైన ఆస్తిపాస్తులు హరించుకుపోయాయి. జేబులో ఒక కానీ వుండేది కాదు. ఐనా ఆయనకు దిగులు వుండేది కాదు ఢిల్లీకి వెళ్లాలన్నా మద్రాసుకు వెళ్ళాలన్నా, టిక్కెట్టు కొనడానికి సైతం డబ్బు వుండేది కాదు ఎవరో టిక్కెట్టు ఖర్చులు, ప్రయాణ ఖర్చులు ఇచ్చేవారు వాటితో బయలుదేరేవారు. ప్రయాణ ఖర్చులకు ఇచ్చిన సొమ్మును, తనకన్నా ఎక్కువ అవసరం వున్నవారికి యిచ్చేవారు. నిజంగా ఆయన దరిద్ర నారాయణుడు

తుంగభద్ర రాజకీయ మహాసభలు 1938లో జరిగాయి. దానికి సారధ్యం వహించింది సుబ్బారావుగారే అప్పటికి చాలా కొద్దిరోజుల క్రితమే ఆయనకు బహిర్ ప్రాణమైన ధర్మపత్ని లక్ష్మమ్మ మరణించింది. ఐనా ఆయన చలించలేదు అదేవిధంగా ఢిల్లీలో ఒక కార్యక్రమములో ఆయన పాల్గొనవలసి వుంది, బయలుదేరి వెళ్ళడానికి నాలుగు రోజుల ముందే ఆయన చిన్నకుమారుడు మరణించాడు. ఐనా సుబ్బారావుగారు ప్రయాణం మానుకోలేదు ఇదేమిటని అడిగినవారికి ఎంత విలపించినా పోయినవారు ఎలానూ రారు, వారికోసం విలపిస్తూ కర్తవ్యాన్ని మరచిపోవడం అర్థరహితమని అన్నారు.

కొందరు రాయలసీమ రాజకీయ నాయకులు - ప్రత్యేకాంధ్రరాష్ట్రాన్ని వ్యతిరేకించినా సుబ్బారావుగారు, హరిసర్వోత్తమరావుగారు రాయలసీమతో కూడిన ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని గట్టిగా సమర్థించారు.

సుబ్బారావుగారు రాయలసీమ అభివృద్ధికీ అనంతపురం జిల్లా అభివృద్ధికి ఎంతో కృషి చేశారు. అనేక గాంధేయ పథకాలను చేపట్టారు

ప్రఖ్యాత స్వాతంత్ర్య సమర యోధుడు కేసవపిళ్లె స్మారకార్థం సుబ్బారావుగారు గాంధీజీ ఆశీస్సులతో అనంతపురంలో కేశవ హరిజన విద్యాలయాన్ని స్థాపించారు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి దామోదరం సంజీవయ్య వంటివారు ఎందరో విద్యార్థులుగా వుండేవారు

ఆయన స్థాపించిన మరో ఉత్తమ సంస్థ హిందూపురంలో పినాకినీ నదీతీరాన వెలసిన సేవామందిరం అది ఒక ఆదర్శ పాఠశాల దానితోపాటు గ్రంథాలయం, ఉచిత వైద్యశాల, బాలల హాస్టలును ఏర్పాటుచేశారు. దీన్ని 1942 లో రాజాజీ ప్రారంభించారు బాలబాలికలలో కులమతాతీత విశాల మానవతా దృక్పథం ఏర్పడా

లంటే ఇట్టి పాఠశాలలు చాల అవసరం అని ప్రకాశంగారు ప్రశంసించారు సేవామందిర స్థాపనలో సుబ్బారావుగారిని అన్ని విధాల సహకరించి తన సంపదను, శక్తినీ సమర్పించిన లింగన్న చిరస్మరణీయులు. ఆయన మరణానంతరం సుబ్బారావుగారు లింగన్న స్మారక నిధిని ఏర్పాటుచేసి పాఠశాలను మరింత అభివృద్ధి పరిచారు.

## లేపాక్షిపట్ల ప్రత్యేకాభిమానం

సుబ్బారావుగారికి లేపాక్షిలోని వీరభద్రస్వామి ఆలయ మంటే విపరీతమైన అభిమానం ఇందులో నందిని చూచి అడవి బాపిరాజు ఉత్తేజితుడై "లేపాక్షి బసవయ్య లేచి రావయ్య" అనే గొప్ప పాటను రాశారు. ఆ దేవాలయంలో అపురూప చిత్రకళాసంపద కుడ్యాలపై విక్షిప్తమయి వుంది సుబ్బారావుగారు బాపిరాజు, ఆమంచర్ల గోపాలరావు వంటి ప్రసిద్ధ చిత్రకారులను ఆహ్వానించి వాటి నకళ్ళను తీయించారు తెలుగుభాషా సమితి ప్రచురించిన విజ్ఞానసర్వస్వంలో లేపాక్షి గురించి ఒక విశిష్ట వ్యాసాన్ని ప్రచురించారు అంతేకాక లేపాక్షి పైన ఉత్తమ రచనలు చేసేట్టు ప్రసిద్ధ పరిశోధకు లను ప్రోత్సహించారు తన ప్రచురణ సంస్థకు లేపాక్షి ప్రచురణలని పేరు పెట్టుకున్నారు తన షష్ఠిపూర్తి ఉత్సవాలు మూడు రోజులు జరుగగా ఒక రోజు ఆయన వాటిని లేపాక్షిలో జరుపుకున్నారు లేపాక్షి ఆలయ సంపదను వెలుగులోకి తీసుకురావడంలో సుబ్బారావుగారు చేసిన కృషికి లేపాక్షి వెంకట నారాయణ ఎంతగానో తోడ్పడ్డారు

పెన్నారుకు ముదస్థలి ప్రాజెక్టు అనంతపురం ఇంజనీరింగ్ కాలేజి, నూనెపరిశోధనా సంస్థలు మొద లైనవి కార్యరూపం దాల్చడానికి సుబ్బారావుగారు ఎంతో కృషి చేశారు

## సాహిత్య కళాపోషకుడు

సుబ్బారావుగారు సాహిత్య కళాపోషకుడు. 1929లో కృష్ణదేవరాయల పట్టాభిషేక మహోత్సవాలు జరిపించి రాయలసీమ కళాపరిషత్తుకు శ్రీకారం చుట్టారు. ఈ సంస్థ ఆధ్వర్యంలో 1944 లో శ్రీ శివభారత రచయిత ఆయిన గడియారం వెంకట శేషశాస్త్రికి గండపెండేరం తొడిగారు 1943 లో పెనుగొండలో జరిగిన సభలో రాణా ప్రతాపసింహ చరిత్ర రచించిన దుర్భాక రాజ శేఖర శతావధానిగారికి రత్నకిరీటాన్ని బహూకరించారు.

1957 లో ఆయన షష్ఠిపూర్తి మహోత్సవాలు సాహితీ సత్కార సభలుగా భాసిల్లాయి కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ, జమ్మలమడక మాధవశర్మ, కిళాంబి భీమారావు వంటి విద్వత్కవులను సత్కరించి వారి కృతులను అంకితం తీసుకున్నారు. అంతేకాక ఉత్పల వెంకటశాస్త్రి, కలుగోడు అశ్వత్థరావు, కల్లూరు వెంకట నారాయణరావు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, బోయి భీమన్న, పోరాంగి శ్రీరామ అప్పారావుల ఉద్గ్రంధాలకు కృతిభర్త అయ్యారు. 1963 కళ్యాణ దుర్గంలో భువన విజయ మహాసభలు నిర్వహించారు.

అనంతపురంలో తనకుగల స్థలాన్ని లలితకళా పరిషత్తుకు దానంగా యిచ్చారు. అక్కడ నిర్మింపబడిన భవనం పద్మశ్రీ కల్లూరు సుబ్బారావు నాట్య విద్యాలయ ముగా ప్రసిద్ధి కెక్కింది

భారత ప్రభుత్వం సుబ్బారావుగారిని పద్మశ్రీతో సత్కరించింది

## కృష్ణార్జునులు

సుబ్బారావుగారిని తలచుకున్నప్పుడు వారి సన్నిహిత మిత్రుడు పప్పూరి రామాచార్యులుగారిని స్మరించుకోక తప్పదు. ఇద్దరూ సమవయస్కులు, ఒకే విధమైన విశ్వాసాలూ, అభిప్రాయాలు, ఆలోచనాసరళి కలవారు. దాదాపు ఒకేవిధమైన రాజకీయ జీవితం వారిది ఇద్దరూ మంచి వక్తలు. సుబ్బారావుగారి ప్రసంగం గంభీరంగా వుండగా రామాచార్యులుగారి ప్రసంగం చమత్కార భూయిష్ఠంగా వుండేది సుబ్బారావుగారు ఉపన్యాసకుడు— ఆచార్యులుగారు రచయిత. 'సాధన' అనే వారపత్రికను కొన్ని సంవత్సరాలు నిర్వహించారు. రచయితలు అందుకనే వారిని కూతగాడూ, రాతగాడని పిలిచేవారుట ఇద్దరూ కృష్ణార్జునుల వంటివారు. నిస్వార్థకతకు, నిజాయితీకి మారుపేర్లు.



# భగవంతుడు భారతావనిలో అవతరించాడు

కి॥ ఆర్. కె. కరంజియా

( అనువాదము : డా॥ రాపర్ల జనార్ధనరావు )

( గత సంచిక తరువాయి )

## షిర్డి బాబా అవతారము

కరంజియా : షిర్డి సాయిబాబా నిజముగ తాను తన తదనంతరము అనగా 1918 పిదప ఎనిమిది యేండ్లకు తిరిగి అవతారము దాల్చెదనని తెలిపియున్నారా ?

బాబా : అవును అట్లు తెల్పియున్నారు ఈ విషయమును కాకాదీక్షిత్, మరి చాలామంది షిర్డిసాయిబాబా చెంతనున్న వారి శిష్యులు పెక్కురు నిర్ధారణ చేసియున్నారు.

కరంజియా : మీరే షిర్డి సాయిబాబా అవతారమని మీరు నిశ్చయముగ ఎట్లు తెలుపగలుగుచున్నారు?

బాబా : నా యందుగల నా జ్ఞానము వలననే నేను దీనిని ధృవీకరించుచున్నాను. మరి షిర్డి సాయిబాబాను చూచిన వారెవరూ నేడు సజీవులుగ లేరు గనుక వేరొక సాక్ష్యాధారమేదియు లేదు నా అనుభవము, మనోభావములే ఆధారములు.

నేను పదేండ్ల వయస్సువాడనై యున్నప్పుడు ఈ ప్రాంతీయులకెవ్వరికినీ ఆనాడు షిర్డి సాయిబాబా యనిన తెలిసిన వారెవరూ లేని సమయాన నేనే షిర్డి సాయిబాబాను అని ఉద్ఘాటన చేయటమే దీనికి నిదర్శనము

ధర్మము మాత్రమే లోకమును రక్షించును...

కరంజియా : తాము చక్కగ వివరించినటుల నేటి ప్రపంచము మానవత్వమును గోల్పోయి మారణహోమమునకు త్రోవదీయుచున్నది గనుక మహాభారత యుద్ధము వంటి వేరొక యుద్ధము జరుగక తప్పదా? తాము తెల్పుచున్న, కృషి చేయుచున్న ధర్మరాజ్యము, రాబోవు యుద్ధానంతరము జరుగునా ?

బాబా : అట్టి యుద్ధము అవతరించుటకు పూర్వమే దుష్టత్వము అంతరించబడవలయును. చిన్ని తరహా కీచులాటలు, కయ్యములు అచ్చటచ్చట ప్రపంచమున జరుగుచునే యుండును. నేటి పరిస్థితిలో వీనిని ఆపుట కష్టము అయితే మహాభారత యుద్ధము వంటి ఘోర యుద్ధము, వేరొక అంశము. శ్రీకృష్ణుని ఆదేశానుసారముగనే మహాభారత యుద్ధము జరిగినది. అర్జునునకు రథసారధియై, దుష్ట శక్తులను ఆయన అంతమొందించినాడు

కాని నేడు చూచినచో దుష్టత్వము విశ్వమంతయు నిండియున్నది అణుయుద్ధమే దాపురించినచో మానవ జాతియంతయు మట్టిలో కలిసిపోగలదు అట్టి వినాశనమే జరుగకుండునటుల చేయుటకే నేను అవతారమెత్తినాను. మానవ హృదయమునుండి క్రోధము, హింస, యుద్ధ భావనలు తొలగించి మారణహోమమునకు త్రోవదీయు ప్రపంచ యుద్ధమును రాకుండా చేయుటయే నా అవతార ధర్మము. ఇట్టి స్థితిని లోకమున నెలకొల్పవలెనన్న మానవ జాతిని వేదములు ఉద్ఘోషించిన విశ్వ మానవ సౌభ్రాతృత్వ విధానము స్థాపించబడవలయును. వేదములు, శాస్త్రములు, అన్ని మతముల ధర్మములను పునరుద్ధరింపచేసి కర్మ బంధములను తొలగింపజేసి ధర్మ సంస్థాపన పునరావృతము చేయబడవలయును.

# సాయిగీత

" యశః ప్రతిష్ఠాం కాంక్షంతః
జనా మూఢాః పతంత్యధః
విష్ఠామివ ప్రతిష్ఠాం యే
త్యజంత్యే తేహి సజ్జనాః

యశము కొరకు గాని, ప్రతిష్ఠకొరకుగాని ప్రాకు లాడ కూడదు ప్రతిష్ఠ కొరకు ప్రయత్నించువారికి అధః పతనము తప్పదు. ప్రతిష్ఠను విష్ఠము (మలము) చూడవలెను అట్టి వారు మాత్రమే సజ్జనులు.

నేనెల్లపుడును "అన్ని మతములను ఉండనీయండి, వారివారి ధర్మములను చాటించుకొననీయండి, దేవుని ఘనకీర్తి అనేకానేక భాషలలో, గీతములలో, వివిధ స్వరములలో గానము చేయనీయండి అదియే సత్య మగు ఆదర్శము మానవజాతి ఏకీకరణ మార్గము నకు, వ్యతిరేకము కలుగనంతవరకు సర్వ మతము లను సమముగ ఆదరించండి" అని ప్రబోధిస్తూ ఉంటాను.

## కోర్కెలేని మానవుడే దైవము

కరంజియా :' స్వామీ ! తాము బోధించున దానినిబట్టి మానవునకూ దైవమునకు మధ్య నిజ మగు భేదము తేడా లేదనిపించుచున్నది. నేను భావించినదిసరియేనా స్వామీ ?

బాబా : పూర్తిగా నిజము దేవుడే మానవుడు. మానవుడే దైవము మనలో అందరి యందును ఆ దైవశక్తి ఇమిడియున్నది నావలె అందరునూ దైవస్వరూపులే. అయితే ఆ దైవశక్తి రక్తమాంసములు కలిగిన శరీరములు ఆవరించి యున్నవి నాకును, ఇతర మానవులకును గల తేడా ఒక్కటియే. వారికి వారియందు నిక్షిప్తమై యున్న దైవశక్తిని వారు గుర్తెరుగుట లేదు పూర్వజన్మ వాసనలనుబట్టి వారు చేసిన తప్పిదములను బట్టి ఈ కర్మ చెరసాలయందు బందీలుగ అవతరించి యున్నారు ఇక నేనన్నచో ఈ మానవ శరీరమును నాకు నేను స్వచ్ఛందముగ స్వీకరించియున్నాను ఇతరులు శరీర ము నుండి జన్మమొందియున్నారు. మరి నేనో, కర్మ బంధనములకు అతీతుడను. ముఖ్యమైన భేదము ఏమనిన వారు కోర్కెల తాకిడికిలోనై ఇటునటు త్రోయ బడుచున్నారు కాని నాకు ఎట్టి కోర్కెయు లేదు నా ప్రధానమైన వాంఛ వారిని కోర్కెలు లేనివారిగ జేయుటయే.

ఉదాహరణకు వడ్లు, బియ్యమును తీసికొందము. లోపల గల ప్రతి బియ్యపుగింజ చుట్టును, ఊక ఆవరించి ఉన్నది. నీకు బియ్యము కావలెనన్నచో పైన కప్పిన ఊకను తొలగించవలయును ఊక, బియ్యము ఒకే ఒక బీజమునుండి వెల్వడినవని గ్రహించవలయును. మానవునియందుగల దైవత్వము ఊకయందుగని బియ్యపుగింజ వంటిది కోర్కెలు కల్గిన మానవుల ఈ బయట కప్పిన ఊకతో పోల్చవచ్చును కావున నా సిద్ధాంత మేమనిన-

జీవితము + కోర్కె = మానవుడు

జీవితము — కోర్కె = దైవము

(సశేషము)

# హైదరాబాద్ నిగమాగమ ప్రారంభోత్సవం
# బంగారుగొలుసు- పూర్వాపరాలు

బి. వి. పట్టాభిరామ్

శ్రీ బి. వి. పట్టాభిరామ్ మెజీషియన్‌గా, హిప్నాటిస్టుగా ప్రపంచ వ్యాప్తంగా మంచి గుర్తింపు ఉన్నది. ఈయనకు జాదురత్న, జాదుసామ్రాట్ బిరుదులు కూడా ఉన్నాయి. ఈయనకు అమెరికాలోని నాష్‌విల్, న్యూ ఆర్లియన్స్‌లో గౌరవ పౌరసత్వం, టెన్నిస్ రాష్ట్ర శాసనమండలిలో గౌరవ సభ్యత్వం కూడా లభించింది. ఈ మధ్య హైదరాబాద్ నిగమాగమం ప్రారంభోత్సవ సందర్భమున భగవాన్ బాబావారు ఒక బంగారు గొలుసును సృష్టించి అది నిర్మించిన ఆర్కిటెక్టుకి యిచ్చారు. దానిమీద నాస్తికులు పనిగట్టుకొని విషప్రచారం చేసారు. ఆ సంఘటనను శ్రీ బి. వి. పట్టాభిరామ్‌గారు చక్కగా విశ్లేషిస్తూ "మహిమాన్వితమూర్తి" అనే గ్రంథంలో వ్రాసారు. వారి అనుమతితో ఆ భాగమును శ్రీవాణి పాఠకులకు అందిస్తున్నాము. వాస్తవాన్ని గ్రహించండి. స్వార్థంతో నాస్తికులు చేసే ప్రచారానికి అడ్డుకట్ట వేయండి. - సం.

ఈమధ్య హైదరాబాదు నిగమాగమం ప్రారంభోత్సవ సందర్భమున జరిగిన సంఘటన కొందరికి గుర్తుండి ఉండవచ్చును. సభాకార్యక్రమంలో అది నిర్మించిన ఆర్కిటెక్టుకి ఒక బంగారు గొలుసు తీసి ఇచ్చారు బాబా. అది పళ్లెం క్రింద నుండి తీసారనీ, దానికి అసిస్టెంటు తోడ్పడాడనీ ఒక పత్రికలో బొమ్మలతో వార్త ప్రచురించారు.

ఏ ఉద్దేశ్యంతో ఆ వార్త ప్రచురించారు ? ఎవరు దానికి ప్రచారం చేసారు ? ఎవరి హస్తం వెనుక ఉంది? అనే విషయాలు పక్కన పెడితే, ఆ ఫొటోలు చూసిన వారికి అవి ఎందుకు ప్రచురించారో అర్థం కాదు. పత్రిక చేసిన ఆరోపణ పచ్చి అబద్ధం అని అనిపించకమానదు ప్రధానితో సహా ఎందరెందరో ప్రముఖులున్న ఆ సమావేశంలో బాబా అందరూ చూస్తుండగా చేసిన మిరకిల్‌ని ఆ పత్రిక ఆలా దుష్ప్రచారం చేయడం పత్రికా స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగం చేయడమే అవుతుంది ఆనాటి సంఘటనకు నేనూ ప్రత్యక్ష సాక్షినే.

ఆ దృశ్యం చిత్రించిన మూడోనాడు నా వద్దకు ఒక వ్యక్తి వచ్చి "నా స్నేహితుడొకడు దూరదర్శన్‌లో పనిచేస్తున్నాడు. అతను నాకు ఓ కేసెట్ ఇచ్చాడు. మెజీషియనుగా, దీని మీద నీ అభిప్రాయాన్ని చేప్తే మనం సంచలనం సృష్టించవచ్చు. బి బి. సి లాంటి వాళ్ళు కూడా వేలకు వేలిచ్చి ఈ టేప్ హాట్ కేక్‌లా కొనుక్కుపోతారు" అని చెప్పాడు.

బాబా అలా చేసి ఉండరని నాకు తెలిసినా, కేసెట్ చూడటానికి అతనితో వెళ్ళాను. అందరం కేసెట్ చూసాము బాబా స్టేజి మధ్యలో నిలబడి ఉన్నారు. శ్రీ శ్రీనివాసన్ అనే విద్యావంతుడు, మద్రాసుకు చెందిన ప్రముఖ పారిశ్రామికవేత్త ఒక వెండి ఫ్రూట్ బవుల్ పట్టుకొని వస్తాడు ఆ సమయంలో అతని వేళ్ళ

# యక్ష ప్రశ్నలకు సమాధానములు

" దేవతాతిథి భృత్యానాం
పితౄణామాత్మ నశ్చయః
న నిర్వపతి పంచానాం
ఉచ్ఛ్వసన్న స జీవతి ".

— ధర్మరాజు

దేవతలూ, అతిథులు, భృత్యులూ, పితరులూ— వీరికి పెట్టకుండా తినేవాడూ, స్వయంగా అనుభవించని వాడూ— ఈ ఐదుగురూ బ్రతికిఉన్నా మరణించిన వాళ్ళతో సమానులు.

---

బవుల్ అడుగు భాగంలో ఉంటాయి ఏ వస్తువైనా పట్టుకోవాలంటే అడుగున వేళ్ళు ఉండితీరాలి కదా? తరువాత బాబా దానిని అందుకుంటారు అందుకునే సమయంలో బాబా వేళ్లు కూడా బవుల్ కిందకు ఉంటాయి. తరువాత అది ఆర్కెస్ట్రాకి ఇచ్చి బాబా గాలిలోంచి గొలుసు ఇస్తారు. అదీ దృశ్యం.

బవుల్ అడుగున అతని చేతులనుండి బాబా గొలుసు అందుకుని ఉంటారనేది వారు అనుకున్నారు. మరి ఆ బవుల్ ఇచ్చిన తరువాత బాబా కనీసం ఒక నిమిషం ఆగి అపుడు గొలుసు తీశారు అంతవరకు చేతిలో గొలుసు ఎవ్వరికీ కనపడదా? పైగా ఆ కేసెట్‌లో మధ్యలో నిమిషం గేప్‌ని చూపకుండా బవుల్ ఇచ్చిన మరుక్షణం గొలుసు తీసినట్లుగా కట్ చేసారు. ఇది స్వార్థంతో, వ్యాపారదృష్టితో, అసూయతో పన్నిన కుట్ర అని ఎవరైనా గ్రహించగలరు.

'మీరు చేస్తున్న ప్రయత్నం వృధా, అందులో ఏమీ లేదు' అని వారికి చెప్పాను వారికి అది మింగుడు పడలేదు మరో ఇద్దరు మెజీషియన్ల వద్దకు వెళ్ళారు. వాళ్ళూ అదే మాట అన్నారు

కానీ వారు పట్టు విడువలేదు రెండు ప్రముఖ దిన పత్రికలకు వెళ్ళి ఆ వార్త ప్రచురించమని కోరారు. అటువంటి బ్లాక్‌మెయిలింగ్ వార్తలను ప్రోత్సహించని ఆ పత్రికలు 'సారీ' చెప్పాయి.

ఇలా లాభం లేదని మరికొంతమందిని వారితో కలుపుకున్నారు వారిలో జీవితంలో దెబ్బతిన్నవారు, నాస్తికులు కూడా ఉన్నారు. వారు ఆ కేసెట్‌ని అనేక కాపీలు చేసి చాలామందికి చూపారు ఆ దృశ్యంలో ఖచ్చితంగా ఏదీ కనపడకపోవడంతో ఎవరూ దాన్ని పట్టించుకోలేదు

అలా ౮౭ రోజులు తిరిగి, తిరిగి చివరకు ఓ పత్రికలో పనిచేసే వ్యక్తికి చూపారు. సహజంగా అద్భుతాలను, మహిమలను నమ్మని ఆయన దానిని సంచలనం చేయాలని ఓ పెద్ద వార్త వేశాడు అర్థం కాని నాలుగు ఫోటోలు కూడా వేశాడు ఉన్నవీ, లేనివీ కల్పించి రాస్తూ బాబా చేసేదంతా మోసం, దగా అంటూ కోపాన్ని వెళ్ళగక్కాడు. బాబా గురించి వాళ్ళిలా అన్నారు, వీళ్ళిలా అన్నారు అంటూ రాస్తూ విదేశీయుడైన ఒక బాబా భక్తుడు, గొప్ప శాస్త్రవేత్త కూడా బాబాను విమర్శించాడని రాశాడు

మర్నాటినుంచీ ఆ పత్రికలో ఆ వ్యాసాన్ని సమర్థిస్తూ ఎన్నో లేఖలు ప్రచురించారు. అవి ఎవరు రాశారో ఒక క్వాలిఫైడ్ జర్నలిస్టుగా నాకు తెలియనిదేం కాదు.

వ్యతిరేకిస్తూ రాసిన మా ఉత్తరాలన్నీ చెత్తబుట్టకు ఆహారమయ్యాయి 'ఇదిగో పులి అంటే అదిగో తోక' అన్నట్లు రేషనలిస్టులు మాత్రం పొడుగైన స్టేట్‌మెంట్లు ఇచ్చారు. అది వారి పాలసీ కాబట్టి తప్పులేదు.

( తరువాయి ౩౨వ పేజీలో )

# కొమురగిరి కారాగార లేఖలు

(గత సంచిక తరువాయి)

సెంట్రల్ జైలు, రాజమండ్రి
12-1-77

ప్రియమైన జయ,

గత లేఖలో 'వ్యక్తిగత శీలము' (Personal Character) ను గురించి వివరించాను. ఈ లేఖలో 'జాతీయ శీలము' (National Character ను గురించి వివరిస్తాను

జాతీయ శీలమనగా 'దేశభక్తి' అని కూడా చెప్పుకొన వచ్చును. మన దేశంలో పూర్వం మంచి వ్యక్తిగత శీలం గల పవిత్రులు ఎందరో ఉండేవారు. మన చరిత్రను ఒక పర్యాయం సింహావలోకనం చేసుకుంటే, మనం ఎందుకు పతనమైపోయినామో, మన రాజాధి రాజులు ఎందుకు విదేశీయులకు లొంగిపోయారో అర్థమవుతుంది వ్యక్తిగత శీలంతోపాటు ఉండవలసిన రెండవ అంశమైన జాతీయశీలము మనలో లోపించటమే ఇందుకు కారణం శక్తిసామర్థ్యములు లేకపోవడంవల్ల మనం ఎన్నడూ ఓడిపోలేదు మనవారిలో స్వార్థం పెచ్చుపెరిగిపోవడం వలన మనం పతనమైనాం. మన రాజ్యాధినేతలలో దేశభక్తిభావం లుప్తం కావటంవలన మన దేశం విదేశీదండయాత్రలకు గురైంది జాతీయ దృక్పథం లేకపోవడం వలన, మాన్‌సింగ్ అక్బరుకు దాసుడై, తన సోదర భారతీయ వీరుడైన రాణాప్రతాప్ సింహుకు తీరని ద్రోహం చేశాడు శివభక్తి పరాయణు లని చెప్పుకొనే పూజారులు, స్వార్థంతో విదేశీయుడైన గజనీమహమ్మద్‌కు సహాయంచేసి సోమనాథ దేవాలయ పతనానికి కారణభూతులయ్యారు జయచంద్రుడు స్వలాభా పేక్షతో ఘోరిమహమ్మద్‌కు సహాయపడి పృథ్వీరాజు ఓటమికి ద్రోహదం చేశాడు. వీరందరూ వ్యక్తిగతంగా చాలా మంచివారే. కాని వీరిలో జాతీయ దృష్టి లేక పోవడంవలన, దేశభక్తి లుప్తంకావడం వలన, సమగ్ర సమాజ దృష్టి లోపించడంవలన, స్వార్థంతో శత్రువు లకు సహాయపడి దేశవిచ్ఛితికి కారణభూతులయ్యారు. ఒక్క వ్యక్తిగత శీలం మాత్రమే దేశాన్ని రక్షించ డానికి సరిపోదు వ్యక్తిగతశీలంతోపాటు జాతీయశీలం కూడా ఉన్నటువంటివారే దేశకళ్యాణానికి ఉపయోగ పడతాడు.

ప్రతి వ్యక్తికీ దైవభక్తి ఎంత అవసరమో, దేశ భక్తి కూడా అంతే అవసరం వ్యక్తి భవిష్యత్తుకు విజాయితీ ఎంత అవసరమో, సమాజ శ్రేయస్సుకు దేశభక్తి కూడా అంత అవసరం. ఈ రెండూ ఒకే వ్యక్తిలో మూర్తీభవించినప్పుడే వ్యష్టికీ, సమిష్టికీ ప్రయోజనం ఉంటుంది. తాను సంపాదించిన మంచితనం పవిత్రశీల సంపదను సమాజాభివృద్ధికి వినియోగించాలి. ప్రతిఫలాన్ని కోరకుండా, కీర్తిప్రతిష్ఠలను ఆశించకుండా, నిస్వార్థబుద్ధితో, తన శక్తిసామర్థ్యములను దేశకళ్యాణా నికి ఉపయోగించాలి అహంకార, అహంభావములను దరికిచేరనీయరాదు. స్వార్థ సంకుచితత్వాలను విడనాడాలి. తన సర్వస్వాన్ని భగవంతుని పాదపద్మములకర్పించి, లోకోపకారమే తన కర్తవ్యంగా ఎంచి, పరోపకార బుద్ధిని పెంపొందించుకొని, మాతృభూమి సమగ్రతను, సమైక్యతను పరిరక్షించడానికి కార్యోన్ముఖులం కావాలి. మాతృదేశం యెడల ఎనలేని భక్తిప్రపత్తులు కలిగి ఉండాలి. మాతృభూమిపట్ల మన హృదయాలలో సతతమూ వీరోచిత భక్తిభావం ప్రజ్వరిల్లుతూ ఉండాలి. మన జాతీయ సంస్కృతీ ధర్మ పరంపరలను

గౌరవించాలి, వాటి ఔన్నత్యానికి తీవ్ర కృషి సలపాలి. అట్టివారినే నిజమైన దేశభక్తులుగా, జాతీయ శీలం గల వారిగా సమాజం పరిగణిస్తుంది.

కనుక ప్రతి ఒక్కరూ వ్యక్తి శీలమును, జాతీయ శీలమును రెంటినీ సంపాదించాలి. శీలరాహిత్యం అత్యంత ప్రమాదకరం శీలము లేనివాడు చిల్లి కుండతో సమానం.

సచ్ఛీల (Good Character) లేని వ్యక్తి తనను తాను ఉద్ధరించుకోలేడు, దేశానికి ఏమాత్రం ఉపయోగపడడు కనుక ప్రతి ఒక్కరు ఈ రెండు శీలములను సంపాదించి జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. ఇక ఉంటా....

ఇట్లు

( 30వ పేజీ తరువాయి )

ఈ విషయం గురించి స్పందిస్తూ జస్టిస్ అంజనేయులు గారు విదేశంలో ఉన్న ఆ శాస్త్రజ్ఞుడికి లేఖ రాశారు కేసెట్ కాపీనికూడా ఆయనకుపంపారు దానికి సమాధానంగా ఆ శాస్త్రవేత్త బాబాని తాను విమర్శించలేదనీ, తనకు బాబాపై అచంచల విశ్వాసం ఉందనీ, పత్రిక రాసినవన్నీ అభూత కల్పనలనీ, కేసెట్‌లో పత్రిక పేర్కొన్న గారడీ ఏమీ కనపడలేదనీ స్పష్టంగా రాసారు.

అదే విషయాన్ని పత్రికకు కూడా రాస్తూ ఆ ఉత్తరాన్ని తప్పక ప్రచురించమని కోరారు. అది సహజంగానే ఇంతవరకు ప్రచురించబడలేదు. అందులో ఆశ్చర్యం ఏముంది ? ప్రచురిస్తేనే ఆశ్చర్యపడాలి. అంతేకాదు, బాబా అసిస్టెంటుగా చెప్పబడ్డ శ్రీ శ్రీనివాసన్ కూడా పత్రికకు ఘాటుగా జాబురాసి దాన్ని ప్రచురించమని కోరారు.

ఆ సందర్భంగా నేనూ, నా మిత్రుడూ ప్రాంతీయ పాస్‌పోర్టు అధికారి శ్రీ రోమెల్ కలిసి సంపాదకుడిని కలిసాము అసత్య ప్రచారాన్ని ఖండిస్తూ మా అసంతృప్తిని వెలిబుచ్చాము.

ఆ ఎడిటర్ అనారోగ్యంతో బాధపడుతున్నారు. అంతకుముందే ఆయన బాబా 'శివం' వచ్చినపుడు దర్శనం కూడా చేసుకున్నారు. 'నాకు ఈ విషయం తెలియదు మీరు ఆఫీసుకి వెళ్ళి చెప్పండి, నా అనారోగ్య కారణంగా నేను కదలలేను' అని ఎంతో మర్యాదగా చెప్పారు.

మేము ఆఫీసుకి వెళ్ళి అడిగాము మాకు ఎటువంటి సమాధానం లభించిందో నేను ప్రత్యేకంగా రాయనవసరం లేదు. కారణమేమంటే ఒక పథకం ప్రకారం తలపెట్టిన కార్యక్రమం అది అది అందులో స్వార్థం ఉంది వ్యాపారం ఉంది, ద్వేషం ఉంది.

అయితే బాబా భక్తులకు మాత్రం భక్తి అణుమాత్రమైనా తగ్గలేదు ఆ పత్రిక మాత్రం కొనడం మానేశారు.

ధ్రువుని చరిత్ర ... (6వ పేజీ తరువాయి)

బోగా నోట మాట రాలేదు. అది గ్రహించిన శ్రీహరి వేదమయమగు తమ శంఖముతో ధ్రువుని చెక్కిళ్ళు స్పృశించగా, గంగా ప్రవాహమువలె, నిరర్గళంగా శ్రీహరిని స్తోత్రించెను అంతట శ్రీహరి '' వత్సా ! నీ తపంబమునకు సంతసించితిని. నీ నిష్ఠయు, నీ భక్తియు, నీ దీక్షయు అనన్య దుర్లభములు. నీ అభీష్టము నాకు తెలుసు నీవు సుదీర్ఘ కాలం చక్రవర్తిగా ప్రజానురంజకంగా రాజ్యపాలన చేయాలి నీ తండ్రి ఇప్పుడు చాలా పశ్చాత్తాపపడుతున్నాడు అన్నపానాదులు త్యజించి నీ రాకకై నిరీక్షిస్తున్నాడు. వెళ్ళి రాజ్యపాలన గావించు తరువాత నీ అభీష్టం నెరవేరుతుంది. ఉన్నతమైన స్థానమునకు చేరుకుంటావు. సప్త ఋషులు మరియు సూర్యచంద్రాదులు నీ చుట్టు ప్రదక్షిణ చేసేటట్లుగ ధ్రువనక్షత్రముగా నీకు స్థానమును కల్పించాను. ధ్రువతారగా శాశ్వతంగా వెలుగొందుతావు, తుదకు నాయందు ఐక్యమయ్యెదవు'' అని దీవిస్తాడు నారాయణుడు

ధ్రువుడు అరణ్యమునుండి ఇంటికి బయలుదేరాడు. ధ్రువుడు ఇంటికి వస్తున్నాడనేవార్త తండ్రి ఉత్తానపాద మహారాజునకు తెలిసింది. తన ఇద్దరు భార్యలను, రెండవ భార్య కుమారుడైన ఉత్తముడు వెంటబెట్టుకొని మహారాజు ధ్రువునికి ఎదురుగా వెళ్ళాడు ఆ అరణ్యములో ఏదో ఒక క్రాంతి ఎదురుగా వస్తున్నట్లు కనిపించింది. దగ్గరికి వెళ్ళేటప్పటికి 5.6 సం॥ ల పసిపిల్లవాని తేజస్సు కళ్ళకు మిరిమిట్లు గొల్పుతున్నది ఆ పిల్లవాడు చిరునవ్వులు చిందిస్తూ ముందుకు వస్తున్నాడు తల్లిదండ్రులను చూచిన వెంటనే వారికి సాష్టాంగ నమస్కారంగావించాడు తనను తిరస్కరించి, కఠిన వాక్కులతో నిందించిన సవతి తల్లి సురుచికి కూడా సాష్టాంగనమస్కారం చేశాడు ఆమె కుమారుడైన ఉత్తముని కౌగలించుకున్నాడు తండ్రి కౌగిలించుకొని ధ్రువుని దీవించాడు. తల్లిసునీత ఆనందంతో ధ్రువుని ఆలింగనం చేసుకొని, తల నిమురుతూ ఆశీర్వదించింది. సురుచి పూర్వపు అసూయను మరచి దీర్ఘకాలం జీవించమని దీవించింది. ఆనాడు నిరుత్సాహంతో, నిస్పృహతో క్రుంగిపోయిన తల్లి సునీత ఈనాటి స్థితిని చూచి ఆనందంతో ఉప్పొంగిపోయింది.

ధ్రువునికి పట్టాభిషేకం చేయ సంకల్పించుకున్నాడు ఉత్తానపాదుడు 6వ సంవత్సరమునకు ముందే అతనికి పట్టాభిషేకంచేసి, రాజ్యభారమును అతనికి వప్పగించి తపోవనమునకు పోయాడు తరువాత ధ్రువుడు శింశుమార ప్రజాపతి కూతురైన ' భ్రమి ' ని వాయుపుత్రికయైన 'యిల' ను పరిణయమాడాడు. ఉత్తముడు వివాహము కాకపూర్వమే వేటకువెళ్ళి ఒక యక్షునిచేతిలో మరణించాడు ఈ ఘోరవార్త విని తల్లి సురుచి మరణించిన కుమారుని చూడబోవ మార్గ మధ్యమున, అరణ్యమునందు దావాగ్నికి గురియై ఆమె కూడా మృతి చెందింది తమ్ముని జంపిన యక్షుని మీద పగదీర్చ దలచి ధ్రువుడు దండెత్తి వెళ్ళి అలకాపురమును ముట్టడిస్తాడు. ధ్రువునకును, యక్షులకు ఘోరయుద్ధము జరుగుతుంది. నారాయణాస్త్రమును ప్రయోగించి వారందరిని ధ్రువుడు ఓడించాడు ధ్రువుడు తిరిగి తన రాజ్యమునకు చేరి ప్రజానురంజకంగా రాజ్యమును పాలిస్తూ, ఒక చంప ప్రజల మన్ననలను అందుకుంటూ మరొక చంప హరినామ సంకీర్తన చేస్తూ తన్మయత్వంతో కాలంగడుపుతూవచ్చాడు. భగవంతుని పిలుపుకై అనుక్షణం ఎదురుచూస్తూ హరినామ సంకీర్తనంలో నిమగ్నుడై తనను తానే మరచిపోతుండేవాడు 'నాయందు ఐక్యమవుతావు' అని లోగడ నారాయణుడు ధ్రువునికి వాగ్దానం చేసాడుగదా! ఇంతలో ఒక విమానం వచ్చి ధ్రువుని సమీపంలో ఆగింది. అందులో ఇరువురు పురుషులుండిరి. వారిని హరి కింకరులని భావించి, ధ్రువుడు వారికి నమస్కరిస్తాడు. వారిరువురు వెనుకటి సంగతులన్నియూ జ్ఞాపకం చేసి ధ్రువ స్థానమునకు రమ్మనమని ఆహ్వానిస్తారు.

ధ్రువుడు శ్రీహరి కృప వలన అనన్య దుర్లభమగు ధ్రువస్థానమును పొంది వెలుగొందుతాడు. ధ్రువుని లాంటి నిష్ఠాగరిష్ఠులు, పవిత్రులు, పట్టుదలగలవారు ఆవిర్భవించడంవలననే భారత దేశ ఘనత ప్రపంచానికి వెల్లడైంది. 5 సంవత్సరముల ప్రాయములోనే ధైర్యంగా కానలకేగి ఆరు మాసములపాటు ఘోరారణ్యములో కఠోర తపస్సు చేసాడు. శ్రీహరి ధ్రువుని పరీక్షింపదలచి విషసర్పములను, క్రూరమృగములను పంపించినా ఏమాత్రం చలించలేదు, కన్నులు కూడా తెరవలేదు. ఆతని భక్తికి, పట్టుదలకు, నిష్ఠకు, ధైర్యమునకు వైకుంఠమునుండి శ్రీహరి దిగిరాక తప్పలేదు. భగవంతుని కోసం వెతుక్కుంటూ ఎక్కడికో వెళ్ళనవసరంలేదని, మన వద్ద త్రికరణశుద్ధి, భక్తి, పట్టుదల ఉంటే భగవంతుడే భక్తుని వెదుక్కుంటూ వస్తాడని ధ్రువుడు నిరూపించాడు దృఢ మనస్కుడైన ధ్రువుని చరిత్ర నాటికి, నేటికి ఏనాటికైనా బాలబాలికలకు స్ఫూర్తిప్రదాయకము. తరాలు తరలినా, యుగాలు దొరలినా మహనీయుల చరిత్రలు కూడా ధ్రువనక్షత్రం లాగే ఆచంద్రార్కం వెలుగొందుతునే ఉంటాయి ◯

గురుపూర్ణిమ సందేశం.... ( 6వ పేజీ తరువాయి )

పరమాత్మను భక్తితో సరియైన భావంతో ప్రార్థించడానికి ప్రయత్నించాలి.

ఈనాడు గురుపూర్ణిమ. దీని అంతరార్థమేమిటి ? గురువులను పూజించడం, వారిచేత మంత్రోపదేశం చేయించుకోవటం గురుపూర్ణిమా ? ఇది కాదు నిజమైన గురుపూర్ణిమ. 'గు' అనగా అజ్ఞానము రు' అనగా నిర్మూలం గావించడం అజ్ఞానమును నిర్మూలనం గావించేవాడు గురువు. మనసు పరిపూర్ణ ఆనందముతో వుండినప్పుడే దీనిని 'పూర్ణిమ' అంటారు. పరిపూర్ణ మనసునందు ఏ దోషములు, ఏ చీకటి, ఏ అజ్ఞానము లేకుండా నిర్మూలమవుతుంది. అదియే గురుపూర్ణిమ యొక్క అంతరార్థము. ప్రాకృతమైన గురువులు గురువులు కాదు. గురువు అనేది నీ హృదయము నందే ఉంటున్నది.

దేవుడనగ వేరు దేశమందున లేడు
దేవుడనగ తనదు దేహమందే
పాపమనగ వేరు పరదేశమున లేదు
తాను చేయు పనుల దగిలియుండు.

కనుక రెండుకూడనూ మన హృదయమునందేఉంటున్నాయి. కనుక మన హృదయాన్ని విశాలంగావించుకోవాలి మనసులోనున్న మాలిన్యాన్ని కడిగివేయాలి ఈ మనసు కడిగినటువంటి సమయమునందు,ఈ మనసునందు మాధవుడు నివసిస్తాడు.ఈ మనసులో దుర్భావనలు ప్రవేశించినప్పుడు మాధవత్వమనేది నివసించడానికి వీలుకాదు. దైవత్వాన్ని చక్కగా చింతించాలి, దైవాన్ని మరువకూడదు దైవమే సర్వరక్షకుడు· దైవాన్ని చూడాలి.... చూడాలి.చూస్తూనే ఉన్నావు కదా! ఐతే భగవంతునికోసం అన్వేషణ చేస్తున్నామంటుంటారు చాలామంది సర్వత్రా వుండినటువంటి భగవంతుని కోసం అన్వేషణ ఎందుకు ? నీవే భగవంతుడవు· నిన్ను నీవు వెతుక్కుంటున్నావా ? నిన్ను నీవు వెతుక్కునేటటువంటివాడు మూర్ఖుడే కనుక భగవంతుని వెతికేటటువంటి వానిని మూర్ఖుడని చెప్పవచ్చును సర్వమూ భగవంతుడే. మనం ఏది చేసినా భగవంతుని కర్మలే ఇట్టి పరిపూర్ణమైనటువంటి భావాన్ని మనం పెంచుకోవాలి విశాలమైన మనసును పెంచుకోవాలి. అయితే ఈనాటి మానవుడు సంకుచితమైన భావాలలో జీవిస్తున్నారు.

కొందరు రామకృష్ణపరమహంస వద్దకు వెళ్ళి " స్వామీ ! మీరు భగవంతుని చూచారా ? ఆతనితో మాట్లాడారా ? '' అని అడిగారు. ఆయన నవ్వుతూ "ఆ ! చూచాను, మాట్లాడాను. మీతో నేను ఏ విధంగా

మాట్లాడుతున్నానో భగవంతునితో కూడా ఆదేవిధంగా మాట్లాడుతున్నాను '' అన్నాడు. అయితే మాకు కనిపించడంలేదే అన్నారు. అప్పుడు రామకృష్ణుడు చక్కటి జవాబు చెప్పాడు '' ఓ పిచ్చివాడా! నీవు ధనం కోసం ఏడుస్తున్నావు, భార్య కోసం ఏడుస్తున్నావు, పిల్లల కోసం ఏడుస్తున్నావు, పదవుల కోసం ఏడుస్తున్నావు, ప్రతిష్ఠల కోసం ఏడుస్తున్నావు. భగవంతుని కోసం ఏడుస్తున్నావా? ఏడవటంలేదే! అలాంటప్పుడు భగవంతుడు ఏవిధంగా కనిపిస్తాడు? భార్య పైనవున్న అభిమానం కూడా భగవంతుని పైన లేదే? కనుక నీకు భగవంతుడు కనిపించడం అసాధ్యము '' అని చెప్పాడు. కనుక భగవంతుని కోసం ప్రార్థించు, పరితపించు, భగవంతుని కోసం సర్వసంగ పరిత్యాగం చేయి. అప్పుడు మాత్రమే భగవంతుడు చిక్కుతాడు. కనుక దైవత్వాన్ని చింతించాలి, అనుభవించాలి, ఆనందించాలి.

మొట్టమొదట త్యాగం చేయటం నేర్చుకోవాలి ఈ అభిమాన మమకారములను క్రమక్రమంగా తగ్గించు కుంటూ రావాలి అప్పుడే మనయొక్క భావములు దైవత్వంలో లీనమవుతుంది. ఈనాడు మనము దుఃఖములకు, కష్టములకు గురి అవుతున్నామంటే, దీనికి కారకులు ఎవరో కాదు మన పాపములు, మన దుఃఖములే అనే సత్యాన్ని విస్మరించరాదు. వీటికి ఎవరో కారకులు కాదు, ఎవరికివారేననే విషయం గుర్తించాలి.

ఈ జగత్తులో మొట్టమొదట కలిపివుంచేటటువంటి శక్తి ఏమిటి? సంఘశక్తి. సంఘశక్తియే నిజమైన శక్తి ఈ సొసైటీలో మనం వున్నంతవరకు ఈ సొసైటీ నియమాలను మనం అనుసరిస్తూ రావాలి. ఈ సొసైటీ అనేది ఒకవిధమైన వ్యాపారం వంటిది. ఒక గ్రామంలో ఒక వ్యాపారి వ్యాపారమును ప్రారంభించాడు. దానిలో పదిమంది సభ్యులు చేరారు వాళ్ళంతా సమానముగా వాటాలు (Shares) వేసుకున్నారు. ఈ వ్యాపారములో లాభనష్టములు సమానంగా తీసుకోవాలనుకున్నారు. అదేవిధముగ ఈ సమాజం లోపల సర్వులూ సభ్యులే. అందరూ షేర్‌హోల్డర్సే. అదేవిధముగ ప్రతి మానవుడు కూడనూ భగవత్ అనుగ్రహం అనే వ్యాపారంలో అందరూ సమానమైన భాగస్వాములుగా తయారుకావాలి ఎక్కడ? అనుగ్రహమనే Bank లో మనం తయారుకావాలి Bank లో కావల్సినదంతా ధనముంటుంది కాని దీనిని ఎవ్వరూ ముట్టటానికి వీలు

## త్వరపడండి! చందాదారులుగా చేరండి!

సం. చందా రు. 64/- లు వెంటనే పంపి భగవాన్ బాబా 70 వ జన్మదిన ప్రత్యేక సంచిక (నవంబర్ '95) తో పాటు శ్రీ సత్యసాయి శతకము (మూడవ భాగం) ను ఉచితంగా పొందండి. అదనంగా చెల్లించనవసరంలేదు.

క్రొత్తగా చందాదారులుగా చేరేవారికి చందాలు రెన్యూవల్ చేసినవారికి మాత్రమే ఈ సదవకాశము. విడిగా కాపీలు అమ్మబడవు.

చందాలు బకాయిలు ఉన్నవారికి ప్రత్యేక సంచిక మరియు శ్రీ సత్యసాయి శతకములు పంపబడవు. కనుక వెంటనే చందాలు రెన్యూవల్ చేయండి. క్రొత్త చందాలు చేర్పించి ఈ సదవకాశమును మీ మిత్రులకు కూడా అందజేయండి. - సం॥

శ్రీ సత్యసాయిబాబాయ నమః

# మనవి

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి 70 వ జన్మదినము సందర్భముగ స్వామియొక్క దివ్య సంకల్పముతో వ్రాయబడిన 99 పుస్తకములను ముద్రించ సంకల్పించుకుంటిని. ఎంతో ప్రేమతో అక్షరమక్షరమును అపురూపముగ కూర్పించి అనంత ప్రేమను చూపిన శ్రీ స్వామి వారి దివ్యచరణసేవకు వినియోగమైన జన్మగ ఆధ్యాత్మికమైన విషయాలతో పద్యములుగ, పాటలుగ, వచనముగ స్వామితోగల అనుబంధ మాధుర్యాన్ని వెల్లడించే భాగ్యము నాకు కలిగినది. అందులో భాగస్వాములు కావాలని స్వామి చరణసేవ పదసేవగ చేయాలని భక్తి శ్రద్ధలనే సిరిసంపదలతో తులతూగే మిత్రులు ముందడుగువేసి ఒక పుస్తకము- 999 ప్రింటింగ్ పుస్తకములుగ ముద్రణ చేయించ పూనుకుంటే, వారి అడ్రసుకు వ్రాతప్రతిని పంపగలను. 99 పద్యములు, 99 పాటలు, వచనములకు వరుసగా అయ్యే ఖర్చు షుమారుగా రూ.1500/-, రూ. 3000/-, రూ.3000/- అక్షరయజ్ఞములో మీరు పాల్గొని స్వామికి ఆనందాన్ని కలిగించే ఆధ్యాత్మిక విద్యను వెలుగులోనికి తేగలరని ఆశిస్తున్నాను.

ఇంటికో పువ్వు ఈశ్వరునికొక మాలగా రూపొందిన రీతిగ అక్షరయజ్ఞాన్ని లక్ష పుస్తకముల పూజలో మీకు తోచిన రీతిగ సహకరించగలరని భావిస్తున్నాను. దివ్యప్రసాదముగ స్వామి కార్యక్రమమును కొనసాగింపచేసిన విజయవాడకు చెందిన **శ్రీ కొత్తమాసు నారాయణరావు గారి** దంపతులకు నా కృతజ్ఞతలు. వారు ఎంతో విశ్వాసముతో డబ్బును అందించి ముద్రణ బాధ్యతను నాకు అప్పగించారు. ముద్రణ చేసే అవకాశము లేకున్న ఈ క్రింది అడ్రసుకు డబ్బును పంపినవారి పేరుతో ముద్రణ చేయించగలను. నవంబర్ 1వ తేదికి పుస్తకములు "ముసునూరు"కు చేర్చాలి. డబ్బు పంపినచో ముసునూరు స్టేట్ బ్యాంక్ కు డ్రాఫ్టు పంపవచ్చును. ఆర్థిక సహకారము అందించిన సహృదయులకు నేను ముద్రించిన పుస్తకములు అన్నీ ఉచితంగా పంపబడుతాయి.

చిరునామా : కోగంటి రమాదేవి
W/O కృష్ణమోహన్ రావు
ముసునూరు - 521 207, కృష్ణాజిల్లా

ఇట్లు
సాయి రమాదేవి

గమనిక : పుస్తకములు స్వామివారికి సమర్పణ చేయటము జరుగుతుంది. సత్సంకల్పముతో సహకరించగల మిత్రులకు నా కృతజ్ఞతలు.

లేదు. మీకు గార్డియన్స్ మాత్రమే గార్డియన్సు హక్కు లుండవు. కాని ఏదైనా సహాయం చేయవచ్చును. ప్రతి బ్యాంకులో కాషియర్ ఉంటాడు వాని చేతిలోనే బ్యాంకులో ఉన్న డబ్బంతా ఉంటుంది కాని ఒక్క నయాపైసా కూడా స్వంతమునకు తీసుకోవటానికి అవకాశం ఉండదు. ఎవరు వచ్చి 'చెక్' యిస్తే వానికి డబ్బు యిస్తుంటాడు. అదేవిధముగ భగవత్ అనుగ్రహం అనేటటువంటి బ్యాంకులో భగవంతుడికి ఈ డబ్బుతో ఏమాత్రం పనిలేదు ఈ డబ్బులూ, ఈ వ్యవహారములు భగవంతునివి కానేకావు. అయితే, నీవు సాధనా ఫలితమనే చెక్ యిచ్చినప్పుడు అనుగ్రహమనే Cash నీకు అందిస్తుంటాడు ఇక్కడ బ్యాంకు యొక్క పద్ధతులు మూడు రకములు 1. నీకు ధనం కావాలను కుంటే, నీవు ముందుగా సంపాదించిన ధనములో కొంత అక్కడ Fixed Deposit చేయాలి, లేక Savings Bank లో వేయాలి అప్పుడే నీ డబ్బును నీవు తీసుకోవటానికి అధికారమొస్తుంది 2. ఒకవేళ నీవు సంపాదించిన ధనం బ్యాంక్‌లో కట్టకుండా ఉండినప్పుడు అప్పు కావాలని అడుగుతావు. అప్పుడు స్థిరాస్తిని దాంట్లో తాకట్టుపెట్టి అప్పును తీసుకొనవచ్చును 3. అదీ లేకపోతే, నీకు డబ్బు కావాల్సివచ్చినపుడు, ఒక శ్రీమంతుని తీసుకొనివెళ్ళి అతనిచేత గ్యారంటీ ఇప్పించి, నీవు అప్పు తీసుకొనవచ్చును. ఈ మూడు మార్గములే ఆధ్యాత్మికమన్నారు. అదేవిధముగ 1 పూర్వజన్మలో గాని, ఈ జన్మలోగాని నీవు సంపాదించినట్టి పుణ్యములు, భగవత్ అనుగ్రహమనేటటువంటి బ్యాంకులో కట్టినప్పుడు, ఎప్పుడుపడితే అప్పుడు భగవంతుని యొక్క అనుగ్రహమును నీవు తీసుకొనవచ్చును 2. స్థిరాస్తిని తాకట్టుపెట్టి కూడా తీసుకొనవచ్చును స్థిరాస్తి అంటే ఏమిటి? నీవు పూర్వం చేసిన పుణ్యఫలమే స్థిరాస్తి 3. ఇక గ్యారంటీదారుడుండాలి గదా! చిన్న చిన్న వాళ్ళను గ్యారంటీకి తీసుకొనివెళ్ళి అప్పు అడిగితే వాళ్ళు అప్పు యివ్వరు. గొప్పవాడినే తీసుకొనివెళ్ళి చూపాలి. ఆ గొప్పవాడే గురువు ఆ గురువు యొక్క గా తోనే నీకు భగవంతుడు అనుగ్రహమనేటటువంటి ధనము అందిస్తూ ఉంటాడు. ఆ గురువు ఎవరు? అజ్ఞాన రహితమైన దివ్యత్వమే గురూజీ.

"గురుర్బ్రహ్మా గురుర్విష్ణు
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః"

అనగా ఏమిటి? సర్వమూ నీవే అనేటటువంటి దీంట్లో, ఆ గురుత్వాన్ని మనం పొందాలి ఈ ఏకత్వాన్ని మనం అనుభవించినప్పుడే, అజ్ఞానమనేటటువంటిది నిర్మూలనమైపోతుంది కనుక అజ్ఞానం నిర్మూలనం కావటమే 'గురువు' అనే పదమునకు అర్థము. ఇంత పవిత్రమైన అర్థమును ఈనాడు విస్మరించి, ఏ కాషాయ వస్త్రమును చూచినప్పటికీ పరుగెత్తుకొనిపోతుంటారు. ఏదో పది రూపాయలు చేతిలో పెడితే చెవిలో ఒక మంత్రం చెబుతాడు. ఇదికాదు గురుత్వానికి సరియైన అర్థము దైవాన్ని నీ హృదయంలో ప్రతిష్ఠింపజేసుకోవాలి. ఆ కాన్షస్ నుంచి వచ్చేటటువంటి వైబ్రేషన్స్‌ను నీవు అనుసరించాలి. ఆ వైబ్రేషన్స్ నుంచి రేడియేషన్‌లో నీవు చేరిపోవాలి. అదియే పరబ్రహ్మ తత్వం జ్ఞానం అన్నారు ఆ జ్ఞానమే భగవత్‌స్వరూపం. ఆ జ్ఞానమునకు ఎట్టి రూపమూ లేదు. అదియే 'ప్రజ్ఞానం బ్రహ్మ' అన్నది వేదం.

ప్రజ్ఞానమంటే ఏమిటి? ఒక సమయంలో ఉండి మరొక సమయంలో చెడిపోవటం కాదు. ఇది ఒక్క టవల్ — ఇది ఒక జ్ఞానమే ఇది ఒక స్పీకరు. ఇది ఒక జ్ఞానమే. ఇదంతా ప్రాకృతమైన పదార్థ జ్ఞానము. ఇది కాదు నిజమైన జ్ఞానము పదార్థ జ్ఞానములో ఎప్పుడు కూడనూ Re Action, Resound, Reflection ఉంటుంది. ఇది ఒక చిన్న ఉదాహరణ. నేను ఇప్పుడు ఈ టేబులును కొట్టాను, నేను టేబుల్‌ను *

( తరువాయి 40వ పేజీలో )

భగవాన్ సాయి దివ్యలీలలు

# నిజ్‌హార్ కుటుంబం

-సేకరణ : కె వెంకటేశ్వరరావు

## నిజ్‌హార్ కుటుంబం

మలేషియా దేశంలో నిజ్‌హార్‌ది ఓ సంపన్న కుటుంబం అతను ఒక పెద్ద కంపెనీలో జనరల్ మేనేజర్ ఆయన భార్య శ్రీమతి మొనిలా ఒక కాలేజీకి ప్రిన్సిపాల్ వారికి ముగ్గురు పిల్లలు

ఆ కుటుంబంలో సభ్యులకు భక్తి, ప్రార్థనలు, పూజలు వంటివి లేకపోయినా, వారు నాస్తికులుకారు. వాళ్ళింటిలో ఏ మతానికి సంబంధించిన పుస్తకమూ లేకపోయినా సంపన్న నాగరిక కుటుంబాలలో వుండే దురలవాట్లులేవు కుటుంబ సభ్యులంతా ఎంతో అన్యోన్యంగా వుంటారు. ముగ్గురు పిల్లలలో పెద్దవాడు రణధీర్‌కి 15 సంవత్సరాలు. చాలా తెలివైనవాడు చదువులో క్లాసులో ఎప్పుడూ ఫస్ట్, అనేక రకాల ఆటలలో ప్రైజులు సంపాదించాడు, చదువుకోవటం అయిన తర్వాత ఎలక్ట్రిక్ వాయిద్యం (Electric Organ) మీద సంగీత సాధన చేసేవాడు.

అది 1975 సంవత్సరం నవంబరు నెల ఒక రోజు రణధీర్ ఎలక్ట్రిక్ వాయిద్యం మీద సాధన చేస్తుండగా తన చేతివేళ్ళు మొద్దుబారినట్లుగా గమనించాడు. వాయిద్యాన్ని తనకు కావలసిన రీతిలో వాయించలేకపోయాడు తండ్రి నిజ్‌హార్ రణధీర్‌ని ఒక డాక్టరుకి చూపించాడు అన్ని పరీక్షలు జరిపిన తర్వాత రణధీర్ శరీరంలో ఏ లోపం కనిపెట్టలేకపోయాడు ఆ డాక్టర్

మూడు నెలలు గడిచాయి, రణధీర్ చేతివేళ్ళే కాక కుడిచెయ్యి కుడికాలు కూడా మొద్దుబారిపోయినవి మలేషియా దేశంలోని ఒక పెద్ద డాక్టరు రణధీర్‌ని పరీక్షచేసి మెదడువాపు వ్యాధి కాని, నరాలకు సంబంధించిన జబ్బుకాని అయివుండాలని నిర్ధారించి, ఖచ్చితంగా తెలుసుకోవటానికి లండన్ వెళ్ళి స్కానింగ్ (Scanning) చేయించమని సలహా యిచ్చాడు.

1976 ఫిబ్రవరి 2[illegible]న రణధీర్; అతని తల్లిదండ్రులు ఇంగ్లండ్ వెళ్ళారు. నేషనల్ హాస్పిటల్‌లో అన్ని పరీక్షలూ జరిపినతర్వాత అక్కడి న్యూరాలజిస్టు నిర్ధారించినదేమిటంటే, రణధీర్ మెదడులో కణితి ఏర్పడిందని, అది రోజు రోజుకూ పెరుగుతుందని చెప్పారు.

నిజ్‌హార్ ఆ హాస్పిటల్‌వారు జరిపిన పరీక్షల రిపోర్టులు తీసుకొని లండన్‌లోనున్న ఒక ప్రపంచప్రఖ్యాత నరాల జబ్బుల స్పెషలిస్టు అయిన డాక్టరు మైకేల్ క్రామర్‌ని కలిసాడు వైద్యపరీక్షలతర్వాత రణధీర్ తల్లి మొనిలా హోటల్ గదికి వెళ్ళిపోయారు.

డాక్టర్ క్రామర్ ఆ పరీక్షల రిపోర్టులన్నీ పూర్తిగా చూసి నిజ్‌హార్‌తో ఇలా అన్నారు. "మీ అబ్బాయికి మెదడు కాన్సర్, అది త్వరత్వరగా వ్యాప్తి చెందుతున్నది ఆ కాన్సర్ మెదడు లోపల వుండటంవల్ల శస్త్ర చికిత్సకు ఆస్కారంలేదు నిర్మొహమాటంగా చెప్పాలంటే, అతడు ఇంకొక 8 నెలలకంటే ఎక్కువ బ్రతకడు' ఈ మాట విన్న నిజ్‌హార్‌కు ఒక్కసారిగా ప్రపంచమంతా అంధకారబంధురమైనట్లనిపించింది. డా॥ క్రామర్స్ ఇంకా ఇలా అన్నారు. 'ఈ జబ్బు లక్షణమేమంటే ముందర కుడిచేయి, తర్వాత కుడికాలు ఉపయోగం లేకుండాపోతాయి తరువాత ఎడమకాలు

డమచేయి అలానే అవుతాయి, ఆ తర్వాత రెండుకళ్ళకు చూపు పోతుంది. తర్వాత రోగి కోమాలోకి పోయి తిరిగి స్పృహ రాకుండానే మరణిస్తాడు' నిజ్‌హార్ ధైర్యం వహించి, 'డాక్టర్‌గారూ! ఎంత డబ్బు ఖర్చయినా సరే ఏమైనా చేయటానికి అవకాశం వుందా?' అని అడిగారు 'దీనికి చేయగలిగింది ఏమీ లేదు. రేడియం ట్రీట్‌మెంట్ ఇస్తే కాన్సర్ కణాల వ్యాప్తి మాత్రం కొంతవరకు తగ్గవచ్చు. దానివల్ల మరికొన్ని నెలలు ఎక్కువ జీవించే అవకాశం వుంది నేను చేయగలిగింది ప్రాణంపోయే సమయానికి మీ అబ్బాయికి ఎక్కువ బాధలేకుండా ఉండటానికి కొన్ని మాత్రలు మాత్రమే ఇవ్వగలను' అన్నాడు డాక్టర్ క్రిమర్.

ఈ విషయం తన భార్యకు గాని, రణధీర్‌కు గాని తెలియనివ్వవద్దని డాక్టరుని కోరాడు. నిజ్‌హార్ దుఃఖాన్ని అతికష్టంపై అదుపులో వుంచుకొని, హోటల్‌కు తిరిగివచ్చి, మనసులో ఇలా అనుకొన్నాడు 'ఈ జబ్బు ఎందుకు వచ్చింది' ఎలా తగ్గుతుందో డాక్టర్లకు తెలియదన్నారు. అంటే ఈ జబ్బు దేవుడిచ్చినది అయివుండాలి. కనుక దేవుడు మాత్రమే తగ్గించగలడు' అని మొట్టమొదటిసారిగా దైవచింతన చేశాడు. భార్యతో అది కాన్సర్ వ్యాధి అని చెప్పలేదుకాని, ఇలా అన్నాడు. 'మనమంతా ఈ జబ్బు తగ్గించమని దేవుని ప్రార్థించాలి" అపుడు శ్రీమతి మొనిలా ఇలా అన్నది "నేను బాబాను చూచివస్తాను, నా స్నేహితురాలు ఈ మధ్యనే భారతదేశం వెళ్ళి సత్యసాయిబాబా వారు అనేక అద్భుతాలు చేసే ఆయనను' చూచివచ్చింది. ఆయనను ఆ దేశంలో దేవునిగా కొలుస్తారట!' బాబాల మీద నిజ్‌హార్‌కి నమ్మకం లేదు. అయినా తన భార్య స్వామి ఫొటో ఒకటి ఇంట్లో పెట్టి ప్రార్థన చేయటానికి అభ్యంతరం పెట్టలేదు శ్రీమతి మొనిలా రణధీర్ చేత కూడా బాబాని ప్రార్థన చేయించింది, ఆ ఇంట్లో మొదటిసారిగా దీపారాధన చేయటం అగరుపత్తులు వెలిగించటం ప్రార్థనలు చేయటం మొదలయ్యాయి. ఆ సమయంలోనే రణధీర్‌కి రేడియం చికిత్స కూడా ప్రారంభమయింది. 5 వారాలలో అతను కాలు, చేయి కొంచెం కదిలించగలిగారు శ్రీమతి మొనిలాకు, రణధీర్‌కు ఇది బాబాను ప్రార్థించడంవల్లనేగాని, రేడియం చికిత్సవల్ల కాదనిపించింది. వాళ్ళిద్దరూ స్వామిని దర్శించాలనుకొన్నారు.

నిజ్‌హార్ వరి ప్రయాణానికి అడ్డుపెట్టలేదుగాని, తనకు బాబాల మీద నమ్మకం లేదనీ భారతదేశంరాలేనని చెప్పారు.

1978 జూన్ 20వ తేదీన తల్లీ కొడుకులు పుట్టపర్తి చేరారు మంచి ఎండగా వున్నా, దర్శనం లైనులో కూర్చున్నారు. స్వామి ఆ రోజు 6 గంటల దాకా దర్శనమివ్వలేదు 6 గంటలకు వచ్చి రణధీర్ ఇచ్చిన వుత్తరం తీసుకున్నారు. ఆ మరుసటిరోజు స్వామి రణధీర్‌కి విభూతి సృష్టించి యిచ్చి, 'తిను' అని చెప్పి వెళ్ళిపోయారు. శ్రీమతి మొనిలాకి ఇది స్వామి కృపకు చిహ్నంగా అనిపించింది. 22వ తేది సాయంత్రం ఇద్దరిని ఇంటర్వ్యూకి పిలిచారు. ముందర విభూతి సృష్టించి యిచ్చి ఇద్దరినీ తినమన్నారు. ఆ తర్వాత తలమీద చేయివేసి ఇలా అన్నారు 'ఈ బాబుకి తలలో జబ్బు వుంది, దానివలన ఈ అబ్బాయి చాలా బాధపడ్డాడు. మీ కుటుంబం అంతా దుఃఖంతో వుంది. ఈ జబ్బు చాలా సీరియస్ అయిన జబ్బు డాక్టర్లు అపరేషన్ చేయటానికి కుదరదన్నారు'' అని చెప్పి మొనిలావైపు తిరిగి "అమ్మా! డాక్టరు ఏమన్నారు" అని అడిగారు. ''స్వామీ మీరు చెప్పినట్లే చెప్పారు. అపరేషన్ చేయడానికి వీలుపడదని చెప్పారు" అన్నది మొనిలా. అపుడు స్వామి ఇది కాన్సర్ వ్యాధి ఈ అబ్బాయి మానసికంగా చాలా కృంగిపోయాడు అని అన్నారు.

తల్లీ కొడుకులు ఆ జబ్బు కాన్సర్ వ్యాధి అని వినటం అదే మొదటిసారి. వారిద్దరి మొహాలలో భయం ప్రస్ఫుటంగా కనిపించింది.

అపుడు స్వామి వారికి అలా అభయమిచ్చారు. 'ఆపరేషన్ చేయవలసిన అవసరంలేదు భయపడవద్దు

ఇపుడు అంతా సరి అవుతుంది' (ఈ వాక్యాన్ని స్వామి మూడుసార్లు అన్నారు) ఈ మాటలు విన్న శ్రీమతి మొనిలా ఆనందభాష్పాలు కారుస్తూ పెద్దగా వెక్కివెక్కి ఏడవటం మొదలుపెట్టింది

స్వామి రణధీర్‌తో ఇలా చెప్పారు. 'నేను నీకొక మందుఇస్తాను రోజూ ప్రొద్దున ఒకచెంచా సాయంత్రం ఒక చెంచా నీళ్ళలో కలుపుకొని త్రాగు అంతా బాగు అవుతుంది. కాని దేవునివిశ్వాసం పోగొట్టుకొనవద్దు, ' వారిద్దరికీ పాదనమస్కారం, విభూతి ప్యాకెట్లు ఇచ్చి ఇక మీరు వెళ్ళవచ్చు' అని చెప్పారు బయటికి వచ్చిన తరువాత ఒక వలంటీరు ఒక చిన్న మందు సీసా రణధీర్‌కి ఇచ్చాడు

ఆ మరునటిరోజు దర్శనంలో స్వామి మరల విభూతి సృష్టించి రణధీర్‌కి ఇచ్చి తినమన్నారు.

మలేషియా తిరిగి వచ్చిన మూడు నెలలలో రణధీర్ పూర్తిగా కోలుకున్నాడు. విజ్‌హార్ రణధీర్‌ని లండన్ పంపించాడు. డాక్టర్లు పరీక్షచేసి జబ్బు ఏమీ లేదని నిర్ధారించడమేగాక, ఇంతకు ముందు మెదడు కాన్సరు అని నిర్ధారించిన పరీక్షలు సరియైనవేనా అనే సందిగ్ధంలో పడ్డారు

ఆ తర్వాత విజ్‌హార్ కూడా భారతదేశం వచ్చి స్వామి దర్శనం చేసుకొని స్వామి భక్తుడయ్యాడు.

)-○-(

( 37వ పేజీ తరువాయి )

కొట్టాననుకుంటున్నావు. కాదు... కాదు టేబుల్ కూడా నిన్ను కొట్టింది. ఇది Re-action కొట్టానను కుంటున్నావు. నీకుకూడా దెబ్బతగిలింది. నీవు టేబుల్‌ను కొట్టటమే కాదు, టేబుల్‌కూడా నిన్ను కొట్టింది ఇది పదార్థజ్ఞానం Resound, Reflection, Reaction ఉండేటటువంటి పదార్థము కాని దైవమనేటటువంటి జ్ఞానమునకు ఏమాత్రం Reflection, Reaction, Resound అనేదిలేదు స్థానము, కాలము, భేదము అనేటటువంటిది దీనికి లేదు. కనుకనే దీనిని ప్రజ్ఞాన మనే చక్రానికి Constant integrated awareness అన్నారు. ఏమాత్రమూ మార్పుచెందనటువంటిది. అదియే 'బ్రహ్మ'. అట్టి బ్రహ్మతత్త్వాన్ని మనం కనుక్కోవాలంటే, మనసును శుభ్రమైన అద్దంగా పెట్టుకోవాలి ఈ అద్దము మీద, ఏ కొంచం దుమ్ము పడినప్పటికీ తక్షణమే దానిని తుడిచివేస్తుండాలి. దుర్భావనలు ఏమైనా ఈ అద్దములో ప్రవేశించిన, తక్షణమే 'ప్రేమ' అనే బట్టను తీసుకో, 'శ్రద్ధ' అనే జలములో ముంచు. ఆ హృదయమనేటటువంటి అద్దములో దానిని పవిత్రం గావించు అదియే జ్ఞానము. ఇలాంటి పవిత్రమైన జ్ఞానము ప్రతి వ్యక్తియందూ ఉంటున్నది. దీనిని గ్రంథములలో చదివితే వచ్చేది కాదు. గురువుల బోధలతో లభ్యమయ్యేటటువంటిది కాదు తనకు తానే దానిని పరిశుద్ధం గావించుకోవాలి అలాంటి దివ్యమైన, భవ్యమైన తత్త్వాన్ని మనం తెలుసుకోవటానికి తగిన కృషి చేయాలి గురుపూర్ణిమ అనగా మనస్సును పవిత్రమైన రీతిగా, పూర్ణమైన రీతిగా మనం పెంచుకోవాలి మన మనస్సులోనున్న మాలిన్యాన్ని పరిశుద్ధం గావించుకోవాలి కేవలం భగవంతుని వర్ణించినంత మాత్రమున ప్రయోజనంలేదు భగవంతుణ్ణి ప్రేమించాలి, ప్రేమించడం గొప్పతనం కాదు మీరు ప్రేమికులు కాకూడదు. ప్రేమనే కావాలి. ప్రేమించేటటువంటివాడు ఒకరినో, ఇద్దరినో ప్రేమిస్తాడు. కాని ప్రేమనే నీవైతే జగత్తునే ప్రేమించవచ్చును. కనుకనే నేను ప్రతి పర్యాయం ' ప్రేమస్వరూపులారా ! ' అంటుంటాను. అందరూ ప్రేమనే. అందరూ ప్రేమనే అయినప్పుడు జగత్తునే ప్రేమించవచ్చును ఒక ప్రేమికుడు (Lover) ఒకరినో, ఇద్దరినో ప్రేమించవచ్చును. ఇది సంకుచితమైన భావమే ఇది పూర్ణభావము కానేకాదు. మీ హృదయమంతా ప్రేమతో నింపుకోవాలి. ఇదే నిజమైనటువంటి పూర్ణమైన, ప్రధానమైనటువంటి గురుపూర్ణిమ అంతరార్థము.

( ది 12-7-1995 న 'సాయి కుల్వంత్' ప్రాంగణం ప్రశాంతినిలయంలో భగవాన్ సాయి యిచ్చిన దివ్య సందేశము నుండి )

# SRI SAI HARI REAL ESTATES

**PUTTAPARTHI** - 515 134

ANANTHAPUR Dt. ANDHRA PRADESH

పుట్టపర్తియందు ప్లాట్లు, ఇండ్లస్థలములు కావలసినవారు, అమ్మదలచినవారు ఈ క్రింది చిరునామావారిని సంప్రదించవలెనని కోరడమైనది.

1. సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్ ఎదురుగా ప్లాట్లు
2. గోకులం పోస్టాఫీసు ఎదురుగా ప్లాట్లు
3. M. R. O. ఆఫీసు ఎదురుగా ప్లాట్లు
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డు వద్ద ప్లాట్లు
5. ప్రశాంతి నిలయం దగ్గరలో గల ప్లాట్లు
6. అపార్టుమెంట్స్ కావలసిన**వారు** కూడా సంప్రదించండి.

నెలకు రు 600/- ల స్కీములో చేరండి. (36 నెలలు) ప్రతి నెలా లాటరీ తీయబడును. బంపర్ డ్రా మారుతీ కారు. 2 సెంట్లు 20 × 40.

---

గమనిక : భగవాన్ శ్రీ సత్యసాయిబాబా డెబ్బై (70) వ జన్మదిన శుభ సందర్భంగా 23-11-95న శ్రీసాయి భక్తులకు మా చిరుకానుకగా అపార్ట్‌మెంట్స్ కావలసిన వారికి డెబ్బై వేల (70 వేలు) రూపాయలకు రిజిస్ట్రేషన్‌తో సహా ఇవ్వగలము.

2వ స్కీ**ము** : 20 × 40 విస్తీర్ణంగల ప్లాటు 1 సెంటు రు 1000/-లు, 2 సెంట్లు రు 2000/- ఒకే పర్యాయం చెల్లించవలెను.

---

వివరములకు :

గ్రంధి యుగంధర్
బాబా చైతన్య సూపర్ బజార్
గుంటూరివారి తోట
గాంధీబొమ్మ దగ్గర
గుంటూరు-522 001
Pnone : 21988

A. KRISHNA RAO
Retd. Dy Collector
1-8-61/1, Temple Alwal
**Secunderabad - 500 010**
Phone : 862868 (p. p)

ఇట్లు
శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్
ప్రో॥ పి. సిద్ధయ్యశెట్టి
ఆర్యవైశ్య సత్రం ఎదురు
పుట్టపర్తి - 515 134
Phone : 7413
S T D 08555